# విజయ

అనుబంధమాలిక వెలువడ్డ
ఇరవైయ్యవ నవల





డా॥ ముదిగొండ శివప్రసాద్

'విజయ' అనుబంధ మాలికలో
వెలువడ్డ ఇరవైయ్యవ నవల

( రెండవ భాగము )

విజయ
80. ధనలక్ష్మి కాలనీ
మద్రాసు-26

విజయ అనుబంధం

'VIJAYA' SUPPLEMENT No: 22
SEPTEMBER 1977
'AAVAAHANA' (IInd Part)
MUDIGONDA SIVAPRASAD

ముఖచిత్రం : గంగాధర్

వెల : చెల్లింపలేనిది
(ఇది 'విజయ' పత్రికతో పాఠకులకు
యివ్వబడ్డ అమూల్య కానుక)

అన్ని హక్కులూ రచయితవి.

ప్రింటర్స్ :
విజయా గ్రాఫిక్స్,
8. ఆర్కాట్ రోడ్,
మద్రాసు-600 026

PLA133M134
ప్ర 4962
13LP

# [illegible]

డా॥ ముదిగొండ శివప్రసాద్

(రెండవ భాగము)

"చాలామందికి వచ్చింది. అనమకొండనుండి పారిపోయిన జైనులూ, బౌద్ధులూ, శత్రురాజ్యాలు చేరి మన పతనానికై ప్రచారం చేస్తున్నారు. మా అమ్మ రాజ్యానికి వచ్చినప్పటినుండి సామంతులకు కన్నెర్రగానే వుంది. మొన్నటికి మొన్న దేవగిరి రాజు మూడు లక్షల సైన్యంతో వచ్చి పరాజితుడైపోయాడు. పరాజితుడైనాడే కాని పూర్తిగా పరాఙ్ముఖుడు కాలేదు. ఈ సారి ముప్పు దక్షిణాదినుంచి వచ్చింది" అన్నది రుయ్యమ్మ.

"అంటే?...."

"కాంచీశ్వర పాలకుడు విజయగండ గోపాలుడు లేడూ, అతడు విప్లవం తీసుకొనిరావాలని ప్రయత్నిస్తున్నాడు. మనుమగండ గోపాలుడు ఉత్తరాది దక్షిణాది అనే భేదాలు కల్పించి, తమిళులనూ కన్నడిగులనూ మనపైకి రెచ్చగొట్టే ప్రయత్నంలో వున్నాడు. దురదృష్టవశాత్తూ మన తెలుగు రాజ్యాలు కూడా వారితో చేతులు కలుపుతున్నాయ...."

రుయ్యమ్మ నిట్టూర్చి కొంచెం ఆగింది —

"ఇంకా చాలా విషయాలున్నాయి. ఏమైతేనేం ప్రస్తుతానికి నా వివాహం ఆగింది."

నేను ఖిన్నురాలినై నాను.

"కామసానీ! ఇది దుఃఖించే సమయంకాదు. కాంచీపురం మీదికి యుద్ధసన్నాహాలు జరుగుతున్నాయి. నీవిక ఇంటికి వెళ్ళవద్దు. నాతోనే వుండు. కొన్ని అత్యవసర రాజకార్యాలలో నీ సహాయం కూడా కావాలి."

"మరి ఈ చిత్రశాలకు మీరు రావడం...."

"అదీ రాజకీయమే! నేను నీకు చెప్పిన విషయాలన్నీ మాహారయ్యకుకూడా తెలియవు. కకుంటే ఏదో రాజకార్యమని మాత్రం అతడికి తెలుసు, అంతే. ఇప్పుడు నేనుగీయిస్తున్న బొమ్మలు రెండూ కేవలం కళాత్మక చిత్రాలు కావు, రెండు రాజకీయ సంకేతాలు. ఈ రెండింటినీ రెండు రాజ్యాలకు పంపబోతున్నాము. జాదమాడి శత్రువులను లొంగదీసుకోమని చెప్పడం ఒక బొమ్మలోని భావం. యుద్ధం రాబోతున్నది సిద్ధంగా వుండమని చెప్పడం రెండవ బొమ్మలోని భావం —"

నేను స్థాణువునై వింటున్నాను.

"ఈ చిత్రాలను నీవు ఒకచోటికి చేరవేయాలి."

"నేనా!"

"అవును — నీవే!"

"ఎక్కడికి?"

"అది దేవ రహస్యం. నీకు కూడా యిప్పుడు చెప్పను. వెళ్ళిన తర్వాత నీకే తెలుస్తుంది —"

నేను భయపడ్డాను.

"భయపడుతున్నావా?" అన్నది రుయ్యమ్మ నామీద చెయ్యివేసి.

"లేదు — లేదు —"

రుయ్యమ్మ మళ్ళీ నవ్వింది.

"నీకేం భయంలేదు. నీ వెంట సైనికులు కవులుగా, గాయకులుగా వేషాలువేసుకొని వస్తారు. కేవలం మేము చెప్పినట్లు చెయ్యి అంతే!"

సోమూ! నేను సరేనన్నాను. అప్పుడు—ఆ మర్నాడు...."

కామసాని ఇంకేదో చెప్పబోతూ అదృశ్యమైంది.

మాధవ్ గడియారం చూచుకున్నాడు. పదిహేను నిమిషాలు అయిపోయాయి.

# 10

వైశ్శీ పూర్ణిమ వచ్చింది. కామసాని మాధవరావుకు చెప్పడం మొదలు పెట్టింది.

"ఆ మరునాడు నేను నిన్ను రహస్యంగా సంపెంగ తోటలో కలుసుకున్నాను. గుర్తుందా—సోమూ?"

"గుర్తుకు రావడంలేదు" అన్నాడు మాధవరావు.

"గుర్తు తెచ్చుకో! కోటలోని సంపెంగ తోటలో మామిడిచెట్టు కింద కలుసుకున్నాను. పక్కనే జలాశయంలోనుండి పైకి ఎగజిమ్ముతున్న నీరు తుంపురులు తుంపురులై మనమీద పడుతున్నాయి."

"సోమూ! నన్నిక 'కామసాని' అని పిలవకు" అన్నాను నేను.

"ఎందుకని?" అన్నావు నీవు.

"ఎందుకనో మరి! నన్ను మాత్రం ఇక కామసాని అని పిలువకూడదు"

"నీ పేరు కూడా పిలువకూడనంతటి నేరం నేనేమి చేశాను దేవీ?" అన్నావు నీవు.

"దేవి—దేవి" అని నాలో నేను రెండుసార్లు గొణుక్కున్నాను.

"బాగుంది సుమా ఈ పేరు" అన్నాను.

"ఏ పేరు?"

"దేవి—అన్న పేరు."

"నీ మాట ఒక్కటీ నాకు అర్థంకావడంలేదు" అన్నావు అప్పుడు నేను, నాకు రుయ్యమ్మకూ మధ్య జరిగిన సంభాషణ చెప్పాను.

"అందుకని నేనొక రాజకీయ కార్యంమీద కాంచీపురం పోతున్నాను. అందువల్ల నా పేరు కామసాని కాకూడదు. ఏం కొత్త పేరు పెట్టుకోవాలా—అని ఆలోచిస్తున్నాను. నీవు నన్ను 'దేవీ' అన్నావు-ఆ పేరుతోనే స్థిరపడతాను" అన్నాను నేను.

"మామూలు దేవివి కావు. శ్రీదేవి" అన్నావు నీవు.

"శ్రీదేవి—ఓహో—చాలా బాగుంది. సోమేశ్వరులవారూ—ఈ కామసాని మిమ్మల్ని వదిలి శ్రీదేవిలో పరకాయ ప్రవేశంచేసి కంచికి పోతున్నది" అన్నాను నేను.

"కంచి గరుడసేవ అనే సామెత వుండనే వున్నది" అన్నావు నీవు.

"నేను పోతున్నది గరుడసేవకోసం కాదు. ఏకామ్రనాధుని సేవకోసం" అన్నాను నేను.

నీవు చిరునవ్వు నవ్వావు.

"నీవు వెళ్తున్నది ఏకామ్రేశ్వరుని సేవకోసం కాదు, శ్రీధరస్వామి సేవకోసం" అన్నావు.

నేను త్రుళ్ళిపడ్డాను.

"శ్రీధరస్వామా! అతడెవరు?" అన్నాను.

"మరి ఎక్కడికి పోతున్నావో నీకు తెలియదా?"

"ఊహూ!—తెలియదు. చిత్రశాలలో 'రహస్య ప్రయాణం' అని చెప్పింది. తర్వాత అంతఃపురంలో కాంచీపురానికి వెళ్ళాలని మాత్రం చెప్పింది. అంతే!" అన్నాను నేను,

"కళలను రాజకీయాలతో ముడిపెట్టడం నాకిష్టంలేదు కామసానీ!" అన్నావు నీవు.

"అంటే?"

"చూడు! దక్షిణాదిలో పాండ్యుల తిరుగుబాటు జరిగింది. వారిని అణచడంకోసం అంబదేవుడు వెళ్ళాడు. అంబదేవుడు నమ్మకస్థుడు కాడు. నేడు కాకపోతే, రేపో మరో పదేళ్ళకో పాతికేళ్ళకో అయినా అంబదేవుడూ కాకతీయ సామ్రాజ్యంపై తిరగబడతాడు. అప్పుడు అంబదేవునిపైకి మళ్ళీ యుద్ధం—ఇవి క్షుద్ర రాజకీయాలు కామసానీ! రాజకీయాలలో కళాకారులు పావులుగా వాడబడకూడదని నా సిద్ధాంతం" అన్నావు నీవు.

"కాని మన కాకతీయ సామ్రాజ్యమే లేకపోతే మనమెక్కడ వుంటాము?" అన్నాను నేను.

"నిజమే! ఆనాడు మనకు అస్తిత్వమే వుండదు. కాని యిలాగే కాంచీపురంలోని శిల్పకారుడూ, వర్తకుడు కూడా ఆలోచిస్తే ఏమవుతుంది? విజయగండ గోపాలుని కళాకారులంతా విజయగండ ప్రభువుకు భృత్యులు. రుద్రమదేవి కళాకారులంతా అమ్మగారి సేవకులు. ఇదీ ఈనాటి విధానం ఇది నశించాలని నా భావం."

రాజ విద్రోహకరమైన ఈ మాటలు విని నేను గజ గజ వణికిపోయాను.

"సోమూ! ఎంత సాహసం నీకు? అమ్మగారి ఉప్పు పులుసు తిని, అమ్మగారినే నిందిస్తున్నావా?" అన్నాను నేను.

"నన్ను అపార్థంచేసుకుంటున్నావు కామసానీ! నేను ఎవరినీ నిందించడంలేదు. ఒక కళాసిద్ధాంతాన్ని చెపుతున్నాను. కాకతీయ సామ్రాజ్యం తాత్కాలికమైనది."

"అమంగళము ప్రతిహతమగుగాక" అన్నాను నేను వణుకుతున్న పెదవులతో.

"ఇక్ష్వాకులు పోయారు, విష్ణు కుండినులు పోయారు— పల్లవులు నశించారు. నిన్నగాక మొన్న చాళుక్యులు పతనమైనారు. నేడు కాకతీయులు, రేపు మరొకరు—ఇలా సామ్రాజ్యాలు వచ్చి పోతుంటాయి. ఒక్కో సామ్రాజ్యానికి ఒక్కో రాజు, ఒక్కో రాణి, ఆ రాణికో కూతురు, ఆ కూతురుకో పెళ్ళి—ఆ పెళ్ళికి మనం మంటపాలు చెక్కడం—ఏమిటిది అంతా? ఆ రాణీ, ఆమె పెళ్ళి ఏమీ

మిగలవు—మనం చెక్కిన మంటపాలు మాత్రం మిగులుతాయి చరిత్రలో" అన్నావు నీవు.

నీవెందుకో శత్రువుల గూఢచారివని అనిపించింది నాకొక్క క్షణం. సోమూ—ఆ మాటే పైకి అన్నాను.

అప్పుడు నీవు నవ్వి యిలా అన్నావు-

"కేవలం రాజాంకితమైన కళా వ్యవస్థలో నా మాటలు విద్రోహకరంగానే అనిపిస్తాయి. ఆశ్చర్యంలేదు. కాని నాది భారతీయ దృష్టి-అంటే విశ్వజనీన దృష్టి" అన్నావు.

"అంటే!"

"చూడు, మాహురయ్య చిత్రశాల చిత్రశాల కాదు. ఒక రాజకీయమందిరం. అంటే కళాకారుడు యిలా వ్యక్తుల చేతిలో కాని, సామ్రాజ్యాల చేతిలోగాని పావులుగా మారకూడదని నా భావం. అతడు అఖిల భారత క్షేమాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకొని పని చేయాలి. అంతేకాదు. చివరకు ఒక మతానికి కూడా అతడు కట్టుపడి వుండడు, శైవమైనా, వైష్ణవమైనా సరే అది పూర్తి దేశక్షేమాన్ని దృష్టిలో పెట్టుకొనే వుండాలి. అంటే, నేను స్వయంభూమంటపం చెక్కినంత అభినివేశంతో జగన్నాధస్వామి మందిరంకూడా చెక్కగలిగివుండాలి."

సోమూ! నిజంగా నేను భయపడిపోయాను. వీరశైవం మన అధికారమతం, రాజమతం. దానితోబాటు వైష్ణవమూ సమానంగా చూడఁడాలన్నావు నీవు. ఈ మాట ప్రభువువింటే, నీకు శిరచ్ఛేదం విధింపబడుతుందేమోనని నేను కంపితురాలినైనాను....

నా ముఖంలోని ఆందోళన నీవు గమనించి చిరునవ్వు నవ్వావు.

నన్ను నీ ఒడిలోకి తీసుకున్నావు.

నా త్రిసరాలనూ తాటంకాలనూ మృదువుగా స్పృశించావు.

నేను పులకించి పోయాను.

ముద్దుపెట్టుకోవడానికి నా మీదికి సున్నితంగా వంగావు. నా భూతిలకపు చీరెకొంగు పట్టుకున్నావు.

నేను బంతిలాగా నీ ఒడిలోనుండి కిందికివొర్లి పచ్చిక బయలుపై పొర్లి నీ చుంబనం నుండి తప్పించుకున్నాను.

నా ముఖంలోని రక్తిమచూచి, మారిన నా మనస్థితి గమనించి అన్నావు—

"కామసానీ! నేను చెప్పింది ఒక కళా సిద్ధాంతం. అంతేకాని రాజద్రోహంకాదు. నేను చెప్పిన మాటలు సాపేక్షమైన దృష్టిగల యీ సమాజానికి అర్థంకావు. అది అర్థమయ్యే సమాజం వుద్భవించే నాటికి నీవూ నేనూ ఉండము."

నిజం చెప్పవద్దూ-నీవు చెప్పిన యీ మాటలు కూడా నాకు అర్థం కాలేదు.

కొంచెం ఆగి నేను అన్నాను.

"గణపతి దేవుడు స్వార్థపరుడా—లేక భారతీయ దృష్టిగల వాడా?"

"భారతీయ దృష్టి కలవాడే!" అన్నావు నీవు.

"ఆయన వెలనాడు జయించడం, పలనాడును జయించడం, దక్షిణాదిని ఆక్రమించి చోళులను పరాజితులను చేయడం, కళింగాన్ని స్వాధీన పరుచుకొని గాంగులను మన్ను కరిపించడం, యివన్నీ స్వార్థంతో చేసిన పనులేనా? చెప్పు సోమూ?"

"కాదు. ఉత్తరంనుండి వస్తున్న విదేశీ దురాక్రమణలను ఎదుర్కొనేందుకై శక్తిసంపన్నమైన ఒక సామ్రాజ్యాన్ని నిర్మించేందుకై జరిపిన ప్రయత్నం."

"ఒప్పుకున్నావుగా! అలాంటప్పుడు గణపతి దేవుని ప్రయత్నమూ" రుద్రమదేవి ప్రయత్నమూ, స్వార్థపూరితమైన దెలా అవుతుంది?"

నీవు చిరునవ్వు నవ్వావు.

"కామసానీ! నీవు చెప్పింది నిజమే....అందుకనే కదా నేనీ రాజ్యంలో వుండగలుగుతున్నది. కాకతీయ సామ్రాజ్యంలో విశాల భారతీయ దృష్టి లోపించిందనే కనుక నాకు అనిపిస్తే. ఆ మరుక్షణమే నా ఉలి, సుత్తె, చేతబట్టుకొని కాందిశీకుడినైపోతాను...."

ఈ మాటలతో నా మనస్సు చల్లబడింది.

"సోమూ! నీవిప్పుడు నిజంగా సోమ కిరణాలను నా మనస్సులో ప్రసరింపజేశావు" అన్నాను నీ తొడపై తల ఆనించి.

"ఇంకో చల్లనివార్త చెప్పనా?" అన్నావు.

"ఏమిటి?"

"ఏమిటంటే నేను కాంచీపురంలోని ఏకామ్రేశ్వరాలయంలో కొత్త నిర్మాణాలకోసం కంచికి పోతున్నాను. నాపేరు సోమేశ్వరుడు కాదు చొక్కనాథుడు."

నేను నివ్వెరపోయాను.

"సోమూ! నీవూ కాంచీపురం వస్తున్నావా?"

"ఆ! వస్తాను నెల్లూరువరకు మీతో బాటే. సింహపురిదాటిన తర్వాత నా దోవ నాది, నీ దోవ నీది"

నేను ఎగిరి గంతేశాను,

"అయితే యిది నాకు రాజకీయ యాత్రకాదు, ప్రేమయాత్ర మరి నాకీ సంగతి చెప్పలేదేం?"

"చెప్పనిస్తేకదా నీవు? ఇది నాకూ మా నాయనగారికీ తప్ప యితరులెవ్వరికీ తెలియదు. ఇప్పుడు నీకుమాత్రం తెలిసింది. అందులోనూ ఆడదానివి"

"ఔను. ఆడవారి నోట్లో నువ్వుగింజనానదు. అంతేకదా-ఫో! రేపీవేళకు సోమేశ్వరుడు మారువేషంలో కాంచీపురం పోతున్నాడని ఏకశిలమొత్తం దండోరా వేయిస్తాను"

"మహాతల్లీ! ఆ పనిమాత్రం చెయ్యకు. చివరకు చామ కొంబతోకూడా అనకు. నీ తలా, నా తలా రెండూ దక్కవు."

నేను ఫక్కున నవ్వి నిన్ను కౌగలించుకున్నాను. నీ కన్నులలోకి సూటిగాచూస్తూ, "అంతబలహీనురాలి నైతే విజయ గండ గోపాలునివద్ద ఈ శ్రీదేవి ఎలా విజయంపొంది రాగలదనుకున్నావు సోమూ? నీవు కేవలం గూఢచారివి. నేను గూఢచారులకు గూఢ చారిని" అన్నాను.

నా మూర్ధాన్ని నీవు పెదవులతో స్పృశించావు.

అలా పరవశంలో మనం ఎంతసేపున్నామో తెలియదు.

ఓరుగల్లు మొగసాలమీది గడియారం మొదటిజామును సూచించింది—

అప్పుడు లేచి నేను అంతఃపురానికి వెళ్ళిపోయాను. గుర్తుందా సోమూ?"

"ఆఁ- కొంచెం కొంచెం గుర్తుకొస్తున్నది" అన్నాడు మాధవరావు.

"ఆ మరునాడే మన కాంచీపుర ప్రయాణం ప్రారంభమైంది. అంటే నా దృష్టిలో మన ప్రణయ యాత్ర!

నేను శ్రీదేవిగా సింగారమైనాను. నీవు చొక్కనాథుడివైనావు. మంథెననుండి వేదపండితులు వచ్చారు. కొరవినుండి వీరభద్రులు వచ్చారు. పానుగల్లునుండి అనుభవంగల ఒక సైనిక పటాలం వచ్చింది. వారందరికీ కళాకారుల వేషాలువేశారు. మాహూరయ్య సిద్ధంచేసిన చిత్రపటాలు నా పల్లకీలో భద్రపరుసుకున్నాను. గణపతి దేవుడూ, రుద్రమదేవి, ఇందులూరి అన్నయ్య మనలను ఆశీర్వదించారు.

సైన్యాధ్యక్షుడైన త్రిపురాంతక దేవుడు, అంబదేవుణ్ణి రహస్య మార్గంలో ససైన్యంగాముందే శ్రీ శైలారణ్యాలకు తరలించాడు.

సోమూ. మన ప్రేమయాత్ర ప్రారంభమైంది ముచికుందను దాటాము మోటుపల్లి చేరాము. కృష్ణను సేవించాము. ముందు బెజవాడ కనకదుర్గముందు అభినయసేవ చేశాను. సాగరతీరం వెంట సాగి గుండ్లకమ్మ దాటాము. దారిలోని నాడులకన్నిటికీ రహస్య సమాచారం అందిపోతూనే వున్నది. సింహపురి వచ్చింది. పినాకినిలో స్నానంచేసి, నదీతీరంలోని వీరభద్రుణ్ణి సేవించాము. కాళహస్తి చేరాము.

సువర్ణముఖిలో స్నానం చేశాము.

"కొంగులు ముడివేసుకొని చేద్దామా?" అన్నావు నీవు.

"నేను కన్యను. నీవింకా నా మొగుడివికాదు" అని కిల కిలా నవ్వాను. నామీదికి నీవు సువర్ణముఖీజలాన్ని చిమ్మావు. గుర్తుందా

సోమూః స్వామినీ, జ్ఞాన ప్రసూనాంబనూ సేవించి, దక్షిణాభి ముఖుల మైనాము. మధ్యలో మనమెక్కడా ఆగకుండా రాత్రింబవళ్ళు ప్రయాణం చేసి కాంచీపురం చేరాము. అంటే పులిబోనులో దూరామన్నమాట."

కామసాని అదృశ్యమైంది. మాధవరావు లేచాడు.

# 11

మళ్ళీ పూర్ణిమ వచ్చింది. కామసాని కథ చెప్పడం మొదలు పెట్టింది.

"కాంచీపురపు పొలిమేరలోనే నీవు మా పటాలం నుండి విడివడిపోయావు. చాళుక్యశిల్పి చొక్కనాధుడు విజయగండ గోపాలుని ఆస్థానంలోకి ఏకామ్రనాధమందిర నూతన శిల్ప నిర్మాణం కోసం ముందుగా ప్రవేశించాడు. తర్వాత నేను శ్రీదేవి పేర నగరం లోకి ప్రవేశించాను.

నా రాకను పరిచారకుల ద్వారా ప్రభువుకు తెలియపరిచాను.

విజయగండ గోపాలుడు నాకు అంతఃపురంలో దర్శన మిచ్చాడు. నేను దేవగిరి రాజు రాసిన లేఖను కంచిరాజు కిచ్చాను.

"శ్రీశ్రీశ్రీ చతుస్సాగర వేలా వలయిత భూ మండల సర్వ సర్వంసహా చక్రవర్తి విజయగండ గోపాలునకు స్నేహపుర స్సరముగా దేవగిరి ప్రభువు వ్రాయించు కళా లేఖ।

కుమారి శ్రీదేవి మా ఆస్థానరత్నం. ఈమెను రహస్యకార్యముపై మీ వద్దకు పంపుచున్నాను. ఈమె కళారీతులు మిమ్ము మిక్కుటముగా సంతోషపెట్టగలవని నా ఆశ। మిగిలిన విషయములు ముఖాముఖీ గ్రహింపగలరు.

(రాజముద్రిక) మహారాజు యాదవుడు."

గణపతి దేవుడు సృష్టించిన యీ లేఖ నిజమేనని నమ్మాడు విజయగండ భూపాలుడు.

"నీ పేరు?" ప్రశ్నించాడు ప్రభువు ప్రభువు. పక్కనే మంత్రి కూడా వున్నాడు.

"కామసాని" అని చెప్పబోయాను—అదృష్టవశాత్తూ నోరు జారలేదు.

"శ్రీదేవి"

"ఎప్పుడు వచ్చావు యిక్కడికి?"

"ఉదయం."

"మహారాజు పంపారా?"

"ఔను ప్రభూ!"

"నాతో ఏమని చెప్పమన్నారు?"

"మీకీ చిత్రపటం కానుక యిమ్మన్నారు ప్రభూ!" అని గీతోపదేశ పటం ఇచ్చాను.

ప్రభువులవారు దానిని నిదానించి చూశారు.

"చాలా కళాత్మకంగా వుంది" అన్నాడు విజయగండడు.

మహామంత్రి మాత్రం అనుమానంగా నా వైపు చూశాడు. నేను ధైర్యంగా నిలబడ్డాను, నా ముఖంలో ఎట్టి సాత్వికభావమూ కనబడనీయకుండా.

"మీ ప్రభువు నాతో ఏమైనా చెప్పమన్నారా?"

"ఔను—"

"ఏమిటది?"

నేను మాట్లాడలేదు.

"మంచిది. నీకు నీ పరివారంతోసహా శివకంచిలో ఏకామ్రనాథ మందిరాని కవతలవున్న తిరుజ్ఞాన సంబంధ మందిరం విడిదిగా ఏర్పాటుచేస్తున్నాము. వెళ్ళి విశ్రాంతి తీసుకో" అన్నాడు.

నాకు విడిది ఏర్పాట్లు చేయడంకోసం యిద్దరు పరిచారికలు వచ్చారు.

వారిద్దరూ గూఢచారిణులని నాకు తెలుసు. నేను వెళ్ళిన తరువాత రాజూ, మంత్రీ నా గూర్చి చర్చించుకుంటారని వూహించాను.

నన్ను గూఢచారిణులు తిరుజ్ఞాన సంబంధ మందిరానికి తీసుకొని పోయారు.

లోగడ నేనెప్పుడూ తమిళ కళా సంపద చూడలేదు. నిజంగా దక్షిణాత్యులు శిల్పకళకోసమే పుట్టరనిపించింది.

కాళహస్తీశ్వర నిర్మాణానికే నేను పులకించిపోయాను. అలాంటిది కంచిలోని ఆలయ ప్రాకార శిల్పాలు నన్ను ఆశ్చర్యంలో ముంచెత్తాయి!

ఆ మాటే పైకి అన్నాను.

"అప్పుడే ఏం చూశారు? మధుర దేవాలయం చూడండి— బృహదీశ్వరాలయం చూడండి. తన్మయులైపోతారు" అన్నారు నా వెంట వచ్చిన గూఢచారిణీ పరిచారికలు.

వీరు స్వచ్ఛంగా తెలుగు మాట్లాడుతున్నారు. అంటే, తెలుగు వచ్చిన వారినే నా మీదికి ప్రయోగించారన్న మాట!

తిరుజ్ఞాన సంబంధ మందిరం చాలా అందంగా వుంది.

చాల భాగం అద్దాల కూర్పు.

అక్కడినుండి ఏకామ్రేశ్వర శిఖర దర్శనమవుతున్నది.

సోమూ! అక్కడినుంచి ఆలయంవైపు చూశాను నీ దర్శనమవుతుందేమోనని.

ఇంకా నీవు గుడిలో ప్రవేశించినట్లులేదు. ఆనాటినుండే నా రాజకీయ కార్యక్రమం ప్రారంభించాను.

అభినయం దాని ముసుగు.

విజయగండనికీ, శ్రీధరస్వామికీ మధ్య విభేదాలు కల్పించడం అంకురార్పణ.

మనుమగండ గోపాలుణ్ణి విజయగండనికి దూరంచేయడం పుష్పోదయం.

విజయగండ పతనం ఫలప్రాప్తి—

ఇదీ నా కార్యక్రమం.

నా పనులన్నింటినీ ప్రభువు గూఢచారిణులు గమనిస్తూ ఎప్పటికప్పుడు రాజు కందజేస్తూనే వున్నారు.

"ఈమె అనుమానాస్పదంగా తోచడంలేదు" అని వారి తొలి నివేదికలు విజయగండనికి చేరాయి. అలా చేరేటట్లు చేశాను నా నేర్పుతో.

ఈ లోగా ప్రభువు దేవగిరికి కబురుపంపాడు. ఆ వార్తాహరుణ్ణి కాళహస్తి దాటకముందే, అంబదేవుని కాయస్థ సైనికులు పట్టుకొని పదివేల సువర్ణ నిష్కాలూ, దారి బత్తానికై మరొక వేయి మాడలూ ఇచ్చి, అసత్య సమాచారం చెప్పమన్నారు. కాని, వాడు అనుమానాస్పదవిలా కనపడ్డాడు. ఫలితం—యమపురి!!

కంచిలో క్రమపద్ధతిలో శ్రీధరస్వామిని లొంగ దీసుకున్నాను.

కళాప్రదర్శనలు ప్రారంభించాను. రసికులు సంతోషించారు. ముఖ్యంగా మనుమగండడు. అతణ్ణి నా వలలో వేసుకున్నాను. అనుకుంటున్న సమయం రానే వచ్చింది. అది చరిత్రాత్మక దినం. నాడు విజయగండడు నేనున్న మందిరానికి వచ్చాడు. వెంట శ్రీధరస్వామి వున్నాడు— సేనాధిపతి!

ఆదరంతో ఆహ్వానించాను.

ముందు భరతనృత్యం ప్రదర్శించాను. తర్వాత కేళికలో ముందు సంగీత కచేరిచేసి, తర్వాత ఆట కచ్చేరి సాగించాను. స్వరపల్లవులు, శబ్దపల్లవులు, సాహిత్య పల్లవులు సాగుతున్నాయి.

"ఇవి కాదు—పదాలు ప్రదర్శించు" అన్నాడు శ్రీధరస్వామి.

"మీ రాసిక్యానికి నా జోహార్లు. నా మనసెరిగిన కళాకారులు మీరు" అన్నాను శ్రీధరస్వామితో.

ఈ మాటకు విజయగండని మనస్సు చివుక్కుమన్నది.

తుమ్మెదపదం, ఆనందపదం ఆడాను!

తర్వాత నా బృందంతో నందికోల నృత్యం, గొండ్లి నృత్యం ప్రదర్శించాను.

అంచరిలా కాక గర్ప నృత్యంలో విడెమెత్తడం కూడా మా అమ్మ నాకు నేర్పింది.

నిర్ణీత స్థలంలో తాంబూలం పెట్టి, గొండ్లలో ఆడుతూ వెనుకకు వంగి పెదవులతో ఆ విడ మెత్తాను.

ఎత్తిన పిడెమును శ్రీధరస్వామి కిచ్చాను. శ్రీధరస్వామి తీసుకోవడానికి సంకోచించలేదు.

"ప్రభువులు—పర స్త్రీల అధర స్పర్శను సహించరు. మీరు సేనాధిపతులు, రసికావతంసులు. అందుకని మీకు" అన్నాను.

ఈ మాటకు విజయగండడు మనసులో వుడుకుతాడని నాకు తెలుసు.

కావాలనే అన్నాను.

రాజుకూ, సేనాధిపతికీ మధ్య మోహినిలా నిలబడ్డాను.

ఇక సుందోపసుందుల కలహం జరగడమే తరువాయి!!

నృత్యప్రదర్శనం పూర్తి అయింది.

"శ్రీధరా! నీవు వెళ్ళు. నేనీమెతో ఏకాంతంగా మాట్లాడి వస్తాను" అన్నాడు విజయగండడు.

శ్రీధరస్వామి అయిష్టంగా లేచి వెళ్ళాడు, రాజును మనసులో తిట్టుకుంటూ.

"కల్యాణీ! నీవెవరు? ఎందుకిక్కడికి దేవగిరి ప్రభువు చేత పంపబడ్డావు? నిజం చెప్పు?" అని ప్రశ్నించాడు విజయగండడు.

"ప్రభూ! నేను కళాకారిణిని. దేశ దేశాలూ తిరుగుతుంటాను. పూర్వం దేవగిరిని ఆశ్రయించాను. దక్షిణాత్యుల కళావైభవం చూడాలని సంకల్పించాను. ఆశీర్వదించి ప్రభువు పంపాడు. అంతే!" అన్నాను.

"కాదు నీవిచ్చిన గీతోపదేశ చిత్రం ఎక్కడిది?"

"ప్రభువులవారు మీకు కానుకగా పంపించారు."

"యుద్ధం రాబోతున్నదని దాని సూచన. మా మహామంత్రి వ్యాఖ్యానించారు. ఆ యుద్ధం ఎవరితో, ఎప్పుడు రాబోతున్నది? నిజం చెప్పు?"

"అది కూడా మీ మహామంత్రినే అడగండి" అని కిలకిలా నవ్వాను.

ప్రభువుకు ఏమి చేయాలో తోచక చూస్తూ వుండిపోయాడు.

వరుసగా సామదాన భేదాలు ప్రయోగిస్తున్నాడు.

"మీ ఆశ్రితులలో ఎవరైనా మీకు అనుమానితులు వున్నారా?" అని ప్రశ్నించాను.

"అంటే...."

"అంటే మీ శత్రురాజ్యాలతో రాయబారం నడుపుతున్న వారు...."

రాజు నివ్వెరపోయాడు.

"మనుమగండ గోపాలుడు ఏకశిలతో రాయబారం నడుపుతున్నాడని మా ప్రభువుకు తెలియవచ్చింది. ఏకశిల మీకూ మాకూ శత్రురాజ్యం. ఆశ్రితునికి ఏకశిలతో ఏమిపని?"

విజయగండడు నివ్వెరపోయాడు.

"నీ మాటకు నిదర్శనమేమిటి?"

"రహస్యంగా మనుమగండని భవనం పరిశీలించండి. మీకే తెలుస్తుంది"

"మంచిది. రేపు కలుస్తాను" అని విజయగండడు వెళ్ళిపోయాడు.

అగ్ని రగలడం మొదలైంది.

ఈలోగా గణపతిదేవుడు మనుమగండనికి రాసినట్లున్న లేఖా, సువర్ణాలు, మనుమగండని వద్దకు సంస్కృత కవివేషధారి ద్వారా పంపాను.

అతడు మనుమగండని మందిరంలో వాటిని జారవిడిచి వచ్చాడు.

విజయగండడు రాత్రికి రాత్రి చారులను పంపాడు.

రహస్యపత్రాలు దొరికాయి.

అప్పుడు మనుమగండడు గ్రామాంతరం వెళ్ళివున్నాడు.

"శ్రీ మనుమగండ మహీపాలురకు,

సమయం కోసం నిరీక్షించండి. సర్వవేళలా శూరత్వం కూడదు. శకుని మేధావి. ప్రభువు చతురంగ వినోది___

గణపతి దేవచక్రవర్తి"

అన్న పత్రం మంత్రి చదివి, "ప్రభూ! మనుమగండడు

గణపతిదేవునితో. ప్రత్యక్షంగా మంతనం జరుపుతున్నాడు. మిమ్మల్ని చదరంగంలో ఓడించి రాజ్యం స్వాధీన పరుచుకోమని దీని అర్థం" అని వివరించాడు విజయగండనికి.

విజయగండడు చారులను మనుమగండని వద్దకుపంపాడు.

శకుని పాచికలాడుతున్న చిత్రపటం మనవెంట వచ్చిన వాడొకడు మనుమగండనికి శ్రీరంగంలో అమ్మాడు చాలా తక్కువ వెలకు. దానితో మనుమగండడు తిరిగివస్తూండగా విజయగండని చారులు చూచారు. వార్త రాజుకు అందింది.

మనుమగండడు దారిలోనే బంధింపబడ్డాడు.

సోమూ! ఏకామ్రనాథ మంటపనిర్మాణం పేర నీవు గుడినుండి కాంచీపుర రాజ మందిరానికి వేసిన రహస్యమార్గం పూర్తి అయింది. రాజకోట నీ శిల్ప సామర్థ్యంలో గాలిమేడలా నిలబడివుంది.

ఆ రాత్రి శ్రీధరస్వామి మందిరంలో నృత్యప్రదర్శన చేస్తున్నాను.

శ్రీధరుడు నా నృత్యపు మత్తులో మునిగివున్నాడు.

అటు కేళిక ప్రారంభమైంది.

ఇటు శ్రీధరునికి మధుపానం ప్రారంభమైంది.

రెండూ సమర్థవంతంగా నిర్వహిస్తూవున్నాను

అంబదేవుని సైన్యం కాంచీపురం ముట్టడించింది. ఈలోగా నా వెంట కవిపండితుల వేషంలోవచ్చిన సైనికులు నీవు నిర్మించిన రహస్యమార్గంద్వారా రాజమందిరంలోకి ప్రవేశించారు.

అయితే మంత్రి విజయగండణ్ణి అప్పటికే అంతఃపురం నుండి తప్పించాడు.

శ్రీధరునికోసం కబురువచ్చింది. ప్రభువులవారు రమ్మన్నారని-

"నేను రాను పొ"మ్మన్నాడు శ్రీధరుడు.

సేనాధ్యక్షుడే తిరుగుబాటు చేయడం చూచి స్తంభించిపోయాడు విజయగండడు.

"ప్రభూ! అనుకున్నంత పనీ అయింది. మనం పంపిన రాయబారి దేవగిరికి చేరనేలేదట! ఈ శ్రీదేవి కాకతీయుల గూఢచారిణి.

ఎక్కడవుందో వెతికి దీనిని ముందు నరికివేయండి. ఎదురుతిరిగిన శ్రీధరుణ్ణి చంపి ఉపసేనాధిపతి ముద్దు కృష్ణయ్యను వెంటనే సేనాధిపతిని చేయండి. మనుమగండయ్యతో శత్రుత్వం ఈ రాత్రికి మంచిది కాదు. పొరపాటున ఆయనను అనుమానించామని వెళ్ళి క్షమాపణ చెప్పి సైన్యాన్ని మీరే స్వయంగా నడిపించండి" అని మహామంత్రి రాజుకు చెప్పాడు.

మరుక్షణమే విజయగండని సైన్యం శ్రీధరుని భవనాన్నిచుట్టుముట్టింది.

అప్పటికిగాని శ్రీధరునికి ఏదో ముప్పు ముంచుకొచ్చిందని తెలియలేదు.

సోమూ! నా కళ్ళ ఎదుటనే శ్రీధరుణ్ణి వాళ్ళ సైన్యమే చంపివేసింది. ఆ రాత్రి అలాగే జరుగుతుందని తెలిసిననేను ఆ దృశ్యం చూచి తప్పుకున్నాను.

నాకోసం భవనమంతా వెతికారు.

నేను అప్పటికే రహస్యమార్గంద్వారా బయటపడ్డాను. నీ గురించి ఆందోళనపడ్డాను నీవు ఏమైనావోనని. రాజు మనుమగండడికి క్షమాపణ చెప్పుకొని యుద్ధానికి పిలిచాడు.

మనుమగండడు అయిష్టంగా సగం మనసుతో యుద్ధంలో ప్రవేశించాడు. మన అంబదేవుని సైన్యం బయటనుండి విజృంభించింది.

భయంకర యుద్ధం...." కామసాని అదృశ్యమైంది. మాధవ్ లేచాడు.

# 12

మళ్ళీ పూర్ణిమ వచ్చింది. కామసాని కథ చెప్పడం మొదలుపెట్టింది.

"అంబదేవుడు సజీవంగా మనుమగండణ్ణి పట్టుకున్నాడు.

విజయుంత గోపాలుడు యుద్ధరంగంనుండి పారిపోయాడు. కాంచీపురం మన స్వాధీనమైంది.

కాంచీపుర రాజమందిరంపై మన కాకతీయధ్వజం ఎగిరింది. పక్షులద్వారా విజయవార్త ఓరుగల్లుకు పంపబడ్డది.

నీవు సురక్షితంగా ఏకామ్రనాథ మందిరంనుండి వచ్చి అంబదేవుణ్ణి కలిశావు.

అప్పటికే నేను అంబదేవునితో మాట్లాడుతూ వున్నాను.

అంబదేవుడు నిన్నూ, నన్నూ ప్రశంసించాడు.

నేనూ, నీవూ అంబదేవుణ్ణి ప్రశంసించాము.

"ఈ పరస్పర ప్రశంసలవల్ల ప్రయోజనంలేదు. నేను ఈ కాంచీపురంలోని తిరుగుబాటును పూర్తిగా అణచివేసి వస్తాను. మీరిక ఓరుగల్లు వెళ్ళిపొండి" అన్నాడు అంబదేవుడు మనతో.

"అలాగే!" అన్నాను నేను.

ఆ సాయంత్రం నిన్నూ, నన్నూ సురక్షితంగా అంబదేవుడు ఓరుగల్లుకు పంపించాడు.

నా కన్నూ కాళ్ళూ, నీ చేతులతో కలిపి కాంచీపురాన్ని పతనం చేశాయి.

విజయగర్వంతో మనం తిరిగి వచ్చాము.

దారిపొడుగునా మనం ఎన్నెన్నో ముచ్చటలు చెప్పుకున్నాము. ఏకశిలలో రుయ్యమ్మ, అన్నయ్య మంత్రిగార్ల వివాహంతోబాటు మన వివాహంకూడా జరగాలనీ, వివాహానంతరం మనమొక అందమైన మందిరం నిర్మించుకోవాలనీ, దానిని స్వయంగా నీవే నిర్మించాలనీ, చాళుక్య, పల్లవ శిల్పకళారీతులన్నీ అందులో లతలుగా, పుష్పాలుగా, పద్మాలుగా చెక్కాలనీ అనుకున్నాము. కాళహస్తినుండి తిరుపతి వెళ్ళాలనుకున్నాము.

ఆ నాటి ఒక్కసంగతీ నీకు జ్ఞాపకంరాకుండా పోయిందా సోమూ!

"దేవీ!" అన్నావు నీవు పల్లకీలో.

"అదేం పేరు? మనం కాంచీనగరందాటి అప్పుడే తిరుపతికి చేరాము" అన్నాను నేను.

"దేవీ! నిన్నిక నేను కామసాని అని పిలువను. నీవు నా దేవివి" అన్నావు నీవు.

మన పల్లకీ ఆరుకొండలూ ఎక్కింది.

"ఆరు కొండలూ ఆరు పద్మాలు. ఆరుకమలాలకూ పైన మోక్ష సహస్రారం. కుండలినీయోగం. అందుకే బాలాత్రిపురసుందరి ఈ ఆరుకొండలపైన ఏడవ కొండమీద వెలిసింది.

"బాలాజీ దర్శనంతో మన వైవాహిక జీవితం ప్రారంభమవుతుంది" అన్నావు నీవు.

"ఆధ్యాత్మికంగా-కని లౌకికంగా మహారాజ సమక్షంలో మా అమ్మ చామకాంబ, మీ కుప్పమ్మ, ఆశీర్వదించగా ఏకశిలలోనే వివాహం చేసుకుందాము" అన్నాను నేను. ఆ మాటకూడా జ్ఞాపకం రావడంలేదా సోమూ? వివాహానంతరం రాణీగారిని ఒప్పించి మనం అధికారిక మైన బాదరబందీ తగ్గించుకొని గృహస్థ జీవితంలో స్థిర పడాలని నీవే అన్నావు.

నేను దురదృష్టవంతురాలిని. ఆనాడు నీమాట విని బాలాజీ సమక్షంలో వివాహం చేసుకున్నా సరిపోయేది. నా దురదృష్టం నన్ను తరుముతున్నది. అమ్మవారిని దర్శించుకొని కొండదిగాము. సాగర తీరంనుండి మళ్ళీ మన యాత్ర ఉత్తరానికి ప్రారంభమయింది.

అప్పుడు వచ్చేటప్పుడు ఇద్దరం గూఢచారుల్లా వచ్చాము. ఇప్పుడు పోయేటప్పుడు ఆధ్యాత్మికంగా దంపతుల్లాగే తిరిగివెళ్ళాము.

మనం ఓరుగల్లువస్తున్నామని ముందుగానే సమాచారం కోటకు అందింది. గణపతిదేవుడూ, రుద్రమదేవి, రుయ్యమ్మ, ముమ్మడమ్మ, మల్యాల గుండయ్య, కుప్పమ్మ, జన్నిగదేవసాహిణి, త్రిపురాంతకుడు, ఇందులూరి అన్నయ్య అంతా మనకు ఎదురువచ్చారు. పూర్ణ కుంభాలతో, వేదమంత్రాలతో మనకు కోటలోకి రాజలాంఛనాలతో అధికారిక మైన స్వాగతోత్సవం నిర్వహింపబడింది. మా అమ్మ ఆనందాశ్రువులు రాలుస్తూ రుద్రమదేవి పక్కన సువాసినులతోబాటు నిలబడివుంది.

ఆ సన్నివేశాలు మరచిపోయావా సోమూ?

భూమికోటనిండా పౌరులు కిట కిటలాడి పోతున్నారు.

రుద్రమ్మ పట్టాభిషేకంనాడు తప్ప అంత ప్రజను ఓరుగల్లు పౌరులు చూచి ఎరుగరు.

నా జన్మ ధన్యమైనదనిపించింది ఒక్క క్షణం. కాంచీపురాన్ని జయించిన సందర్భంగా విజయోత్సవం ప్రకటించారట ఆనాడు మనం వచ్చేసరికి!!

ప్రధానమైన రాజమందిరాలన్నిటిముందూ చందనంతో కలయం చల్లి, కాశ్మీర కుంకుమలతో ముగ్గులుపెట్టారు. ఇందు రజముతో రంగ వల్లులు తీర్చారు. కలువలూ పద్మాలూ తోరణాలుకట్టారు. పగలల్లా పద్మాలు వికసించి సంధ్యనుండి కలువలు విరిసి రేయింబవలు తేడా లేకుండా తోరణాలు వెలిగాయి. వేలాది ప్రజలు కోటలో ప్రదర్శన శాలలో ఆసీనులైనారు.

జాజరపాటలు పాడుతూ జాణలు వీణలతో సంగీత ప్రదర్శన మిచ్చారు రంగస్థలిలో—

ప్రేరణ శివతాండవం ప్రదర్శింపబడింది.

కోలాటము, గొండ్లి ఓరుగంటి నర్తకీమణులు ఆడారు. యక్షగానాలూ, తోలుబొమ్మలాటలు ప్రదర్శించారు.

రుద్రమదేవి సభామధ్యంలో నిలబడి, "నేటినుండి చామకాంబను మా ఆస్థాన నర్తకీస్థానంనుండి తొలగిస్తున్నాము" అని ప్రకటించింది.

కడివెడు పాలలో ఒక విషబిందువులాగా ఈ ప్రకటన విని సభ నివ్వెరపోయింది.

"చామకాంబ స్థానంలో ఇకమీద కామసాని కాకతీయుల ఆస్థాన నర్తకిగా వుంటుంది. సకల అధికార రాజలాంఛనాలతోనూ ఆమె ప్రవర్తిస్తుంది" అని చిరునవ్వుతో ప్రకటించింది.

అదివిని సభమొత్తం పున్నమినాటి పాలసముద్రంలాగా ఆకాశ మెత్తున ఆనందంతో హోరుపెట్టింది.

సోమూ! నీవు సోముడివి-

నీ ముఖం చంద్రబింబమైతే నేను పాలసముద్రంలా ఆ రాత్రి పొంగి పొంగి ప్రవహించాను.

నా జీవితానికి అదే మధుర రాత్రి!!

కాకతీయ సైనికవీరులు, కుంతములు, గండ్ర గొడ్డళ్ళు, గదలు, ముసలములు, ముద్గలములు, కటార్లు, చక్రమూ తోమరములు, ఛురికలు, బాణములూ, శూలములూ, వివిధగతులలో తిప్పి మన పరాక్రమానికి కీర్తితోరణాలెత్తారు.

ఇటు నర్తకీమణుల నృత్యం!
అటు మహా వీరుల శౌర్యం!!
శస్త్రం-శాస్త్రం ఒకేచోట దర్శనమిచ్చింది ఆ రాత్రి!!

ఆ రాత్రి సభముగిశాక మనకు విందుభోజనాలు.

కప్పురభోగి వంటకము, అపూపములు, లడ్డువములు, ఇడ్డెనలు, కుడుములు, అప్పడములు, ఇప్పట్లు, గొల్లెడలు, జిల్లేడుకాయలు, దోపియలు, సేవియలు, అంగర పోలియలు, సారసత్తులు, చక్కిలములు, మడుగుపూవులు, మోరుండలు, పుండ్రేక్షుఖండరసమూ, అరిసెలూ, బొప్పట్లు, పాయసములు, గజ్జిణులు, బుడుకులు, బాలతిమ్మనములు, దోపలు, పూపలు, మోదకములు-ఓహ్! ఎన్ని కూరలు, ఎన్నెన్ని నంజులు!! ఎన్ని పాయసాలు.... ఏమి గౌరవ భోజనమది, భోజనానంతరం కర్పూరతాంబూల సేవనం చేస్తున్న నన్ను చూచి చిరునవ్వు నవ్వావు నీవు.

నేను సన్నగా కన్నుగీటాను. నా శ్రీవన్నియ పైటజారింది.

"ఆస్థాన నర్తకీమణి ప్రథమాభినయమా ఇది!" అన్నావు నీవు.

నేను నవ్వి అన్నాను- "సోమూ! ఈ నర్తకీపదవివల్ల నాకు అధికార బాధ్యతలు కొత్తవి వచ్చాయి. ఫలితం బంధనం! నేనేమో నిన్ను చేసుకొని హాయిగా చెట్లలో, చేమలలో,కల కలాలతో, కలరుతాలతో,నవ్వులతో, పువ్వులతో, మేఘాలతో పావురాలతో ఆడుకోవాలనుకుంటున్నాను స్వేచ్ఛగా. ఏమిటో దైవేచ్ఛ...." ఇలా అని నిట్టూర్చి చెపుతున్న కథను మధ్యలో ఆపి, విషాదవదనంతో కామసాని ఆగింది.

మాధవరావు గడియారం చూచుకున్నాడు అయిదు నిమిషాలు గడిచాయి.

తలపైకెత్తి చూచాడు. కామసాని అదృశ్యం కాలేదు. ఆమె దర్శనం ఇంకా తనకు పదినిమిషాలు లభిస్తుందన్నమాట!

మరి మధ్యలో ఎందుకీమె అలా ఆగింది?? మాధవరావు మాట్లాడకుండా ఆమె ముఖంలోకి అలాగే చూస్తున్నాడు.

కృష్ణపక్షంలోని చంద్రబింబంలా వెలవెలబోతున్నది కామసాని ముఖం.

"ఆ తర్వాత....?" అన్నాడు మాధవరావు.

"ఇంకేముంది? ఆ మరునాటినుంచే మన విషాదగాధ ప్రారంభమైంది. రుయ్యమ్మ నిన్ను ఒక్క క్షణం వదిలి వుండేదికాదు. నేను వస్తే తిరస్కరించేది కాదుకాని, నాకు నీతో ఏకాంతంగా మాట్లాడేందుకు అవకాశం లభించకుండా పోయింది.

రుయ్యమ్మ కల్యాణమంటపానికి నీవు తుదిమెరుగులు తీర్చి దిద్దుతున్నావు.

ఎంత గుండయ్యగారి పెంపుడు కొడుకువయినా నీవు సామాన్య శిల్పివేనన్న భేదం విస్మరించి రుయ్యమ్మ నీతో నిరంతరం శిల్పాలవద్దనే కూర్చుని శిల్పశాస్త్రం గూర్చి చర్చిస్తూ వుండేది. అది నాలో అనుమానాన్ని రేపింది.

ఒకనాడు ఎలాగో ఒంటరిగా నిన్ను చిక్కించుకున్నా.

"ఏమిటిలా వచ్చావు దేవీ?" అన్నావు నీవు.

"దేవీ! ఎందుకు? 'కామసానీ' అనే పిలువు" అన్నాను నేను.

"ఎంత మాట! నా ప్రియురాలివి నేను 'దేవీ' అని పిలుచుకునేందుకే నోచుకోలేదా?" అన్నావు నీవు.

"ఏమో! పురుష ప్రేమ చంచలమంటారు. తుమ్మెద ఎన్ని పూవుల మీదనైనా వాలవచ్చు." అన్నాను నేను.

"అంతే?...." అని అనుమానంగా ముఖం చిట్లించి నీవు నా వైపు చూశావు.

"ఏమో నాకేమి తెలుసు—ఎప్పుడూ ఎవరెవరో నీతో ముచ్చటిస్తూనే వుంటారు" అన్నాను నేను.

అప్పటికి నీకు అర్థమైంది.

వెంటనే "శాంతం పాపమ్" అన్నావు నీవు.

నేను నీవైపు సూటిగా చూశాను:

"దేవీ! స్త్రీల ప్రేమ మాత్సర్యంలో ఎంతవరకు పోతాకో నీవు నిరూపించావు. కలలో అయినా తలచకూడని పాపాన్ని నీవు నోటితో అనడానికి వెనుదీయ లేదు."

"నేనేమీ అనలేదే?"

"అనలేదు వాచ్యంగా—కాని వ్యంగ్యంగా అంతా అన్నావు. రుద్రమ్మగారు మన తల్లిగారు. మాణిక్యమ్మ మనకు అక్కగారు. రుయ్యమ్మ చెల్లెలితో సమానం. ఈ సృష్టి ఎంత విచిత్రమైనది! కేవలం ఏకోదరులు కానంత మాత్రాన ఒక స్త్రీ—ఒక పురుషుడు అన్నా చెల్లెళ్ళవలె వ్యవహరించే అవకాశమే లేదా?"

"ఉండవచ్చు...."

"అన్నాచెల్లెళ్ళలాగా కాదు. పోనీ అభిమానంతో జీవించే అవకాశం లేదా?"

"అంటే—"

"అంటే ఒక పురుషుడు మరొక పురుషుణ్ణి అభిమానించినట్లు. ఒక స్త్రీ. మరొక స్త్రీని అభిమానించినట్లు. ఒక స్త్రీ మరొక పురుషుణ్ణి అభిమానించే అవకాశం లేదా?"

"ఎలా వుంటుంది సోమూ! స్త్రీ. పురుషుల మధ్య అభిమానం సకామకమైనది. కోరిక లేకుండా ఒక స్త్రీ. ఒక పురుషుణ్ణి ఎందుకు అభిమానిస్తుంది?"

"అదే ఈ సమాజానికి అర్థంకాదు. అర్థంకావడానికి యింకా కొన్నివందల సంవత్సరాలు పట్టవచ్చు. శృంగారం అమలినంగా కూడా వుండవచ్చు."

ఈ మాట విని తాచుపాములా లేచాను.

"లేదు. నాది మలిన శృంగారమే. నీవు ఎన్ని శాస్త్రీయ పారి

భాషిక పదాలూ, ఎంత పాండిత్యమూ ప్రదర్శించినా నీమధ్యా, నా మధ్య వున్నది భార్యా భర్తల సంబంధమే!" అన్నాను నేను ఖండిత నాయికా భంగిమలో.

నా నాగినీ రూపాన్ని చూచి నీవు కొంచెం బెదిరిపోయావు. గుర్తుందా సోమూ!

"నీవూ నేనూ భార్యా భర్తలమే. కాని నేను చెప్పింది సిద్ధాంతం."

"అయితే ఈ సిద్ధాంతం ఎవరికి వర్తింపచేస్తావు? రుయ్యమ్మకా? సిద్ధాంతపు ముసుగులో ఏమిటి నీ నాటకం?"

వెంటనే నీవు రెండు చెవులూ మూసుకున్నావు.

"నీవు చెలివి, ఆమె చెల్లి!! అవే మన సంబంధాలు. అయితే ఇందాక చెప్పిన అఖలిన శృంగారం నా మనస్సులోని ఒక భావం. ఈ భావం నాకన్నా ముందు ఎవరికైనా పూర్వం వచ్చిందేమో తెలియదు. కని మానవ సృష్టిలో ప్రేమ అమలినంగా వుండే అవకాశం వుందా లేదా అనే నాచర్చ!! ఉండేందుకు అవకాశం వుందని కాలం నిరూపింపవచ్చు!

రుయ్యమ్మ విద్వాంసురాలు. అంతేకాదు. ఆమె మానసికంగా హిమాలయ శిఖరం. చర్చలలో ఒక్కొక్కప్పుడు నేనే ఆమెను అందుకోలేక పోతున్నాను."

"అయితే మీరు ప్రతిదినమూ చేస్తున్నచర్యలు యివేనా?" అన్నాను నేను కోపంతో.

వెంటనే నీవు ఫకాలున నవ్వి నన్ను గట్టిగా కౌగలించుకొని, "ఇలాంటివే!" అన్నావు.

"అయితే నేనిక నీ ముఖంచూడను" అన్నాను కోపంతో.

నీవు నా పెదవులను ముద్దుపెట్టుకోబోయావు.

నేను కోపంగా ముఖం పక్కకు తిప్పుకున్నాను.

"నీవు ప్రేమ మూర్తివి! నన్ను మనసారా ప్రేమిస్తున్నావు. కాని దేవీ! నేను చెప్పిన శాస్త్ర చర్చ ఒక ఆదర్శం"

"ఆదర్శంవేరు, వాస్తవంవేరు" అన్నాను నేను ఆనాడు.

సోమూ! ఇన్ని మాటలూ అనుకున్నాము. కాని చివరకు జరిగిం దేమిటి?! ఆ రుయ్యమ్మే నా కొంప ముంచింది" అని కామసాని ఏదో చెప్పబోయి అదృశ్యమైంది.

పదిహేను నిమిషాలూ అయిపోయాయి!

# 13

మాధవరావు మానసికంగా బాగా అస్వస్థుడైనాడు. శారీరకంగా చిక్కి పోయాడు. ఉద్యోగంమీద దృష్టి బాగా సన్నగిల్లిపోయింది. ఆఫీసులో కూర్చోలేకపోతున్నాడు. లెక్కలలో తప్పులవల్ల ఎందల మీద వేలమీద రూపాయలతేడా ఒక్కోసారి వస్తున్నది. అయినా వేయి స్తంభాలగుడిని వదలడంలేదు. మళ్ళీ పూర్ణిమ వచ్చింది. సాయంత్రం కాగానే గుడిలో శిధిల మంటపం చేరాడు.

చంద్రోదయమైంది.

కామసాని వచ్చింది.

"రుయ్యమ్మ మనకు చేసిన అపచారమేమిటి దేవీ?" అన్నాడు మాధవరావు.

అప్పుడు కామసాని ఇలా అన్నది-

"రుయ్యమ్మ, అన్నయ మంత్రిగార్ల వివాహం అంగ రంగ వైభోగంగా జరిగింది. సమస్త దిక్కులనుండి సామంతులు కానుకలు పట్టుకొని వచ్చారు. వచ్చినవారంతా కల్యాణమంటపం నిర్మాణం లోని నీ శిల్ప చాతుర్యాన్ని వేనోళ్ళ పొగిడారు. అది విని నిజంగా నేను పరవశించిపోయాను.

సోమూ! నా జన్మ ధన్యమైందని అనుకున్నాను. శివాచార్యుల వారు నూతన దంపతులను ఆశీర్వదించారు.

"మమ్మల్ని ఆశీర్వదించండి స్వామీ!" అన్నాను నేను.

ఆయన చిరునవ్వు నవ్వి ఆశీర్వదించారు.

"కల్యాణ ఘడియరానీ! అప్పుడు మంత్రాక్షతలతో ఆశీర్వదిస్తాను. ఈ లోపల శాంభవీదీక్ష యిస్తాను" అన్నారు శివాచార్యులవారు.

"సరే" నన్నాను నేను.

సోమూ!

మా అమ్మతో నేను మన వివాహంగూర్చి మాట్లాడాను. పెళ్ళి అయిన తర్వాత వీలైతే నృత్యం మానివేయాలని అనుకుంటు న్నట్లు అన్నాను. అది విని "అమ్మాయీ! నేను పెద్దదాని నైనాను. రుద్రమదేవికి మనపై అనుగ్రహం ఎక్కువ. అందుకే మళ్ళీ నా స్థానంలో నిన్ను ఆస్థాన నర్తకిని చేసింది. కలిసివచ్చిన దానిని కాల దన్నుకోకూడదు. ఇలా వంశపారంపర్యంగా ఎందరికీ వింతగా అదృష్టం దక్కుతున్నది?? ఆమె తప్పకుండా మీ ఇరువురి వివాహం చేయగలదు. సోమేశ్వరుడు కూడా యోగ్యుడు. కుప్పమ్మకూ, గుండయ్యకూ ఇతడు కన్నకొడుకుతో సమానం. పైగా కాంచీపురాన్ని ఛేదించిన శిల్పి. కారణ జన్ముడని శివాచార్యులవారే ఒకసారి అనగా నేను విన్నాను. అట్టి వాడు నీకు మొగుడు కావడం నా అదృష్టం. ఇవ్వాళే నేను రుద్రమ్మగారితో ఈ విషయం మాట్లాడుతాను" అన్నది.

అలగే వెళ్ళి మాట్లాడిందికూడా. రాణీగారువిని చిరునవ్వు నవ్వారట!!

ఆ మరునాడు సాయంత్రం మన మిరువురం సంపెంగ తోటలో కలుసుకున్నాము.

"ఏమిటి నీ ముఖం యివ్వాళ షోడశ కళాప్రపూర్ణమైన చంద్రు నిలా వెలుగుతున్నది!" అన్నావు నీవు.

"మన లౌకిక వివాహం జరుగబోతున్నది" అన్నాను నేను.

నీవు నా వైపు ఆశగా చూశావు.

సోమూ! ఆ చూపు నేనెప్పుడూ మరచిపోలేను.

"కాంచీపుర విజయయాత్ర తరువాత వస్తూ బాలాత్రిపుర సుందరి సమక్షంలో, మానసికంగా మనం వివాహం చేసుకున్నాము,

కాని ఇప్పుడు శాస్త్రోక్తంగా మా అమ్మ రాణీగారితో మాట్లాడి వివాహం చేయబోతున్నది. సోమూ! నాదో కోరిక...."

"ఏమిటి?"

"రుయ్యమ్మ. అన్నయ మంత్రిగార్లకు నీవు నిర్మించిన ఆ కల్యాణమంటపంలోనే మన వివాహంకూడా జరగాలి" అన్నాను వుత్సాహంతో

నీవు చిరునవ్వు నవ్వావు.

"ఏం, రాజకుమార్తె అయిపోవాలనా?" అన్నావు.

"అంతకన్నా ఎక్కువే! నీవు అఖిలభారత ఖ్యాతి గడించిన శిల్ప సార్వభౌముడివి. నీ హృదయాధిరాణిని నేను. భారతదేశానికే రాణిని" అన్నాను నేను.

"రాణీగారూ! మీ పరిపాలన యింకా ప్రారంభంకాలేదు. ఈ లోపల నాకు రాజుగారు కొన్ని ఆజ్ఞలు యిచ్చారు" అన్నావు.

"అంటే?"

సోమూ! నీవప్పుడు నాకు అధికారపత్రాన్ని చూపావు. అందులో మందడలో గోళకీ మఠ నిర్మాణాన్ని చేపట్టాలనీ, వేయి స్తంభాలగుడిని పూర్తిచేయాలనీవుంది.

"అవును దేవీ! గోళకీమఠం అఖిలభారతస్థాయిగల వీర శైవ విద్యాపీఠంగా తీర్చిదిద్దాలని శివాచార్యులవారి కల. మునిగొండ లోని నా నిర్మాణమూ కాంచీపురంలోని నా విధ్వంసక చాక చక్యమూ మళ్ళీ రుయ్యమ్మ కల్యాణమంటప నిర్మాణంలోప నా ప్రతిభ ఆయనను ముగ్ధుణ్ణి చేశాయట! అందుకని గోళకీమఠ నిర్మాణం నాకు అప్ప గించారు. నేనే ప్రధాన శిల్పాచార్యుణ్ణి. నాకింద ఎందరో వయసు మళ్ళిన మహాశిల్పులు పని చేస్తారు.

ఇకపోతే వేయి స్తంభాలగుడి రుద్రదేవుని కాలంలో ప్రారంభ మైంది. రుద్రదేవుల అకాలమరణమూ, వారి తమ్ముడు మహాదేవుడు రాజ్యానికి వచ్చినా యాదవరాజు జైతుగి దండయాత్రలూ, ఈ నిర్మాణ కార్యక్రమానికి వందయేండ్ల ఆటంకంగా నిలిచాయి మహాదేవుని కొడుకు గణపతిదేవుడు. ఆయనకు తండ్రిమీదఎంత ప్రేమ వుందో

పెదనాయనగారి మీద కూడా అంతే గౌరవం వుంది. అందువల్ల రుద్రదేవుడు సంకల్పించిన ఈ గుడి తన కాలంలో తన కళ్ళ ఎదురుగానే పూర్తి అయితేచూచి కన్ను మూయాలని ఆయన చివరి కోరిక. అందుకనే గోళకీ మతనిరాణ్యం ముగియగానే వేయి స్తంభాల గుడి పని మొదలుపెట్టమని ఆజ్ఞాంపిచారు అన్నావు.

"మంచిదే! వివాహమైనాక నేనూ నీతో మంధడవస్తాను. నేను అభినయం చేస్తూ వుంటాను. నా భంగిమలను నీవు చెక్కు." అన్నాను నేను.

"బాగుంది. పెళ్ళికిపోతూ పిల్లిని చంకబెట్టుకొని పోయాడట వెనుకటికి ఒకడు. అలా వుంది నీ సంగతి. నీవు నా వెంటవుంటే నా ధ్యానం నీమీదే వుంటుంది, శిల్పంమీద వుండదు" అన్నావు.

సోమూ! నాకెందుకో ఆ క్షణాన అశుభం స్ఫురించింది మనస్సుకు.

లేకుంటే నీ నోట అపాడు సామెత ఎందుకు రావాలి?

"అమంగళం ప్రతిహత మగుగాక!" అనుకున్నాను మనస్సులోనే.

ఆనాటి సంపెగతోట సమావేశం నేనిప్పటికీ మరచిపోలేను!

నేను వెల్లికిలా పచ్చగడ్డిపై పడుకున్నాను. మొగసాల గంటలు మొదటిజాము గడిచినట్లు సూచించాయి.

"ఇక వెళ్దామా?" అన్నావు నీవు.

నేను నీ కాళ్ళపై తల ఆనించి పడుకొని-

"ఊహూఁ" అన్నాను.

"ఎందుకని?"

"ఏమో- నాకు యివ్వాళ వెళ్ళాలనిపించడం లేదు."

"నాకూ అలాగే వుంది కాని...."

ఆ తర్వాత నీవు మాట్లాడలేదు. నేనూ మాట్లాడలేదు.

నాకు తెలియకుండానే నిద్రపట్టింది.

మెలకువ వచ్చి చూచేసరికి పక్కన నీవు లేవు.

మొగసాలమీది గడియారం మూడవజామును తెలియజేసింది.

అప్పుడు లేచి నేను ఇంటికివెళ్ళాను.

సోమూ! అదే నా బతుకుకు మిగిలిన ఆఖరి మధుర రాత్రి!!

మరునాడు తెలిసింది తెల్లవారుజామునే నీవు మందడవెళ్ళి పోయావని!!

రాత్రి చెపితే నాకు బాధ కలుగుతుందని చెప్పకుండా దాచావని గ్రహించాను.

సోమూ! శివాచార్యులవారు నిన్ను శిలలతో బంధించి వేశారు.

రాళ్ళుతప్ప వేరే ప్రపంచం నీకు కన్పడకుండా చేసారు.

దానితో నన్ను పూర్తిగా మరచిపోయావు...."

కామసాని భోరున ఏడ్చింది

మాధవరావు నిర్వీణ్నుడైనాడు.

ఆమెను ఓదార్చడానికి అతడికి శక్తి చాలడంలేదు....

కొంచెమాగి కామసాని మళ్ళీ యిలాచెప్పింది-

"నీ కోసం అలా ఎదురుచూస్తూ కూర్చున్నాను. దినాలు గడిచాయి, వారాలు గడిచాయి, పక్షాలూ నెలలూ దొర్లాయి. ఒకటి రెండుసార్లు నేను మందడ రావాలని ప్రయత్నించాను. కాని, నాకు రాజానుమతి లభించలేదు. బంగారు పంజరంలో చిలుకలాగా అయి పోయాను.

ఒకనాడు నేను అంతఃపురానికి వెళ్ళాను. అప్పుడు రుద్రమ దేవి, రుయ్యమ్మలు ఏకాంతంలో వున్నారు.

ముమ్మడమ్మకు కొడుకుపుట్టాడు. ఆ శిశువుకు ప్రతాప రుద్రుడని నామకరణం చేశారు.

ఆ సందర్భంగా జరిపే వేడుకలలో నృత్యప్రదర్శనాల ఏర్పా ట్లకై రమ్మని రుద్రమదేవిగారే కబురుపెట్టారు.

నేను రావడం వారికి తెలియదు.

"ఉత్సవాలకు అంతా వచ్చారు. కాని సోమేశ్వరుడు మాత్రం రాలేదు" అన్నారు రుద్రమదేవిగారు.

"నేనే వద్దన్నాను. సోమేశ్వరుడు కళాతపస్వి. అతణ్ణి నిర్మాణ

కార్యక్రమంనుండి భంగం చేయడం నాకు ఇష్టంలేదు" అన్నది రుయ్యమ్మ.

"కావచ్చు. కాని ఆస్థానశిల్పి రాకపోతే ఎవరైనా ఏమైనా అనుకుంటారు" అన్నారు రుద్రమదేవి.

"వాళ్ళ అభ్యంతరాలు రేపటికి తీరిపోతాయి. కాని సోమేశ్వరుని శిల్పం అజరామరమై విలసిస్తుంది" అన్నది రుయ్యమ్మ.

"పాపం! కామసాని ఏమనుకుంటుందో!" అన్నారు రాణీగారు.

రుయ్యమ్మ కొన్ని క్షణాలు మౌనం వహించి, "నిజమే! కామసాని బాధ నాకు తెలుసు. ఆమె వివాహం కాకుండా ఆపింది నేనే! కాని నేనేంచేయను? నా ఆదర్శం వేరు" అన్నది రుయ్యమ్మ.

ఈ మాటలు విని నేను కొయ్యబారిపోయాను. పుట్టెడు దుఃఖం ముంచుకు వచ్చింది.

ఈ మహాతల్లేనా మనలను విడదీసింది?? ఇంతవరకూ శివాచార్యుల ఆజ్ఞ, ప్రభువులవారి కోరిక-అని అనుకుంటున్నాను.

సోమూ!

ఇక నేను ఒక్క-క్షణంకూడా అక్కడ నిలబడలేను.

గిరుక్కున వెనుదిరిగి పోయాను. అంతఃపుర దాసీజనంవచ్చి "కామసాని వచ్చి వెళ్ళిపోయింది" అని చెప్పారట రాణీగారితో.

"అరెరే! మాట్లాడకుండానే ఎందుకు వెళ్ళిపోయింది?" అన్నారట రాణీగారు. మళ్ళీ ఒక్క-క్షణం ఆగి-

"రుయ్యమ్మా! మన సంభాషణ కామసాని విన్నట్టున్నది. అందుకే విచారంగా వెళ్ళిపోయివుంటుంది." అన్నారట రాణీగారు.

సోమూ! ఆ సాయంత్రం నేను నృత్యప్రదర్శన యివ్వలేదు.

కబురు మీద కబురు నాకు అందాయి. అయినాసరే మొండికెత్తాను

నాకీ ఆస్థాన నర్తకిపదవీ వద్దూ-

ఈ సామ్రాజ్యమూవద్దు- తెగించిన దాన్ని రుద్రమదేవి మాత్రం ఏమి చేయగలదు??

"ప్రతాప రుద్రులవారి నామకరణోత్సవ సందర్భంగా మీరు

ప్రదర్శన యిచ్చి తీరాలి. లేకుంటే అది అశుభంగా భావిస్తారు పెద్దలు" అని మళ్ళీ పరిచారికలు కబురుతీసుకొని వచ్చారు.

"ఏమిటి అశుభం? రుద్రమ్మగారి తర్వాత ఇతడే రాజవుతాడా? ఈ ప్రతాప రుద్రునితోనే ఈ సామ్రాజ్యం ఏమైనా అయిపోతుందా. నా నృత్యప్రదర్శన లేకపోతే? నాకు శరీరం అస్వస్థంగా వుంది! పొండి." అని తరిమివేశాను వచ్చినవాళ్ళను.

సోమూ! ఆనాడు ఆస్థాన నర్తకి నృత్యం లేకుండానే ఉత్సవం ముగిసింది.

నీకు ఆశ్చర్యం కలుగవచ్చు నాకింత సాహసం ఎలా వచ్చిందని?

సోమూ!

నాకూ ప్రేమ, అభిమానమూ వుంది.

కామక్రోధ లోభమోహాలూ వున్నాయి.

నేను గొప్ప నర్తకిని కావచ్చు!

కాని సామాన్యమానవురాలినే!

మానవ గుణాలన్నీ నాకూ వున్నాయి.

నీ ప్రేమముందు నకీ సామ్రాజ్యమెంత?

ఆస్థాన నర్తకి పదవి ఎంత??

నిజం చెప్పవద్దూ, ఆనాటినుంచే నాకు మనోవ్యాధి పట్టుకుంది. దిన దినమూ క్రుశించిపోసాగాను. అన్నము, నీరూ, హితవు తప్పిపోయాయి. 'సోమూ, సోమూ' అని నీ పేరను జపిస్తూ తిరిగేదాన్ని. తడవకొకసారి సంపెంగ తోటకు వెళ్ళి పిచ్చిదానిలా అక్కడ ఎంతో సేపు కూర్చునేదాన్ని.

నా దురవస్థ చూచి మా అమ్మ చాలా బాధపడింది. పూర్వం లాగా నాకు నృత్యంచేయాలనే కోరికలేదు.

ఒకటి రెండుసార్లు రాణీగారు కబురుపెట్టినా నేను పోలేదు.

దానివల్ల వారికి కోపం వచ్చిందో ఏమో నా మీద వారికి అనుగ్రహం తప్పినట్లుంది. ప్రతాపరుద్రుడి జన్మోత్సవానికి నృత్యం చేయలేదని ముమ్మడమ్మ చాలా బాధపడిందట!

నిజమే! రాజకుమార్తె కాబట్టి ఆమె బాధపడుతూంది. ఆ బాధకు విలువ వుంది. కాని నా బాధ ఎవరూ పట్టించుకోరా??

నాకూ పెళ్ళాడి సుఖించాలనే కోరిక వుండటం తప్పా??

రుయ్యమ్మకు మొగుడు కావలసివచ్చినప్పుడు నాకక్కర లేదా??

ఈ మాట ఆమెను అడగాలని అనుకున్నాను

అలా అనుకొని ఒకసారి ఇందులూరి అన్నయ్యగారి భవనానికి వెళ్ళాను.

భటులు నన్ను అడ్డగించారు.

నివ్వెరపోయి, "ఆస్థాన నర్తకికి అభ్యంతరమా?" అని వారిని కసిరాను.

సోమూ!!

నేను ఆస్థాన నర్తకిని కానని, ఆ పదవినుండి నన్ను తొలగించారని ద్వారపాలకులకు తెలుసు. కాని నాకు తెలియదు కదూ!!

వాళ్ళు లోపలికి కబురు పెట్టారు.

కాని నాకు అనుమతి లభించలేదు.

అప్పుడు నా దుఃఖం ఏమని వర్ణించను సోమూ? కాంచీపుర విజయంతో వచ్చినప్పుడు అఖిల దిక్ప్రజలతో స్వాగతమందుకున్న కామసానికేనా ఈనాడు ద్వారపాలకులచేత తిరస్కారం??

భోరున ఏడుస్తూ ఇంటికి పోయి మంచంమీద పడిపోయాను.

ఆ తర్వాత కొన్నాళ్ళకు....

ఆస్థాన నర్తకి భవనం ఖాళీచేయించి, ఈ గుడికి వెనుక మోహరివాడకు దూరంగా వున్న వీరభద్ర నగరంలో మాకు ఇల్లు యిచ్చారు.

మా అమ్మతో వచ్చేశాను నేను.

"రాజానుగ్రహం తప్పిపోయింది" అని మా అమ్మ ఏడ్చింది.

"పోతేపోయింది నాకది అక్కర లేదు. నాకు కావలసిందల్లా ఒక్కటే! ఒక్కసారి రుయ్యమ్మను కలియడం. ఆమెను నిలబెట్టి కసి తీరా అడగవలసిన నాలుగూ అడగడం" అన్నాను.

సోమూ! ఆ అవకాశం రానే వచ్చింది. అకస్మాత్తుగా ఒకనాడు సాయంత్రం రుయ్యమ్మ స్వయంగా మోహరివాడనుంచి మా ఇంటికి వచ్చింది...." కామసాని అదృశ్యమైంది.

మాధవరావు లేచాడు.

# 14

మళ్ళీ పూర్ణిమ్మ వచ్చింది. కామసాని ప్రత్యక్షమై మాధవరావుకు కథ చెప్పడం మొదలుపెట్టింది.

"మా అమ్మ అప్పుడు ప్రదోషకాలార్చనకై దేవాలయంలోకి వెళ్ళింది. నేనొక్కతినే మంచంమీద పడివున్నాను. అప్పుడు రుయ్యమ్మ అలా ఒంటరిగా వస్తుందని నేను కలలోకూడా ఊహించలేను.

రుయ్యమ్మ అధికారదర్పంతో రాలేదు.

చాలా సామాన్యంగా పాదచారియై లోపలికి వచ్చింది. వెంజావళి రవికె, హంస పట్టుచీరె ధరించి వున్నది.

నేను లేవబోయాను.

ఆమె నివారించి దగ్గరలోనే వున్న ఆసనాన్ని నా సమీపంలోకి లాక్కొని కూర్చున్నది.

"కామసానీ! నీ శరీరారోగ్యం సరిగా లేదని విన్నాను...." అన్నది.

"ఆఁ. ఏదో మీ దయవల్ల!"

"ఎందుకా కోపం?"

"నాకు మిగిలింది అదే రాజకుమార్తెగారూ! నా ప్రియుణ్ణి నాకు దక్కకుండా చేశారు. ఆస్థాన నర్తకి పదవినుంచి తొలగించారు. ఏకశిలనుండి అనుమకొండ మోహరివాడకు చేర్చారు. ఇంకా మీరు చేయగలిగిందేముందో చేయండి. నా బొందిలో ప్రాణాలు

మిగిలి వున్నాయి. వాటిని కూడా తీసుకునేందుకు వచ్చారేమో తెలి యదు" అన్నాను నేను క్రోధంతో.

రుయ్యమ్మ మాట్లాడలేదు.

"తగిన వైద్యుణ్ణి పంపామే!" అన్నది.

"చెంపదెబ్బకొట్టి క్షమించమని అడిగినట్టున్నది నీ ధోరణి. నాకు వ్యాధి నీ వల్ల వచ్చింది. ఈ వ్యాధికి ఔషధం మండపలో వుంది. నీవు పంపిన వైద్యుని దగ్గర లేదు" అన్నాను తిరస్కారంగా.

రుయ్యమ్మ మళ్ళీ కొంతసేపు మౌనం వహించింది.

"నీవు ఆవేశంలో వున్నావు కామసానీ! నేనేం చెప్పినా అర్థం చేసుకోలేకపోవచ్చు!" అన్నది రుయ్యమ్మ

"నీవేం నాకు చెప్పనక్కర్లేదు. నేను నిన్ను రమ్మనలేదు కూడాను. ఏనాడు నేను ఆస్థాన నర్తకిగా పనికిరాకుండా పోయానో అనాడే మన సంబంధ బాంధవ్యాలు తీరిపోయాయి. కేవలం లక్షలాది మీ ప్రజానీకంలో నేనూ ఒక అనామకురాలిని. నన్ను చూడటంకోసం ఏ రాజకుమార్తె రానక్కరలేదు."

రుయ్యమ్మ మళ్ళీ మౌనం వహించింది.

కొంచెం ఆగి, "నీ ఆరోగ్యం బాగాలేదు. ఆస్థాననర్తకి పదవి అలంకారప్రాయమైనది కాదు. నిత్యం నృత్యప్రదర్శనలు ప్రభువుల ఎదుటా, రాయబారులఎదుటా, స్వయంభూస్వామి ఎదుటా వుంటాయి. అలాంటిది నీవు నీ బాధ్యత నిర్వహించలేనప్పుడు వేరేవారిని నియ మించి వారికి రాజనర్తకీ లాంఛనాలు జరిపించి, ఆ భవనం యివ్వడం తప్పనిసరి అయింది. అందువల్ల నీకు అవమానం జరిగిందని నీవు భావించవద్దు. నీ శరీరారోగ్యం చక్కబడితే మళ్ళీ నీ పదవీ, నీ భవనమూ నీకు లభిస్తాయి" అన్నది రుయ్యమ్మ.

"ఆహాహా! మీ ఔదార్యానికి ధన్యవాదాలు! కాని ఒక విషయం ఆలోచించండి రాకుమార్తెగారూ! మీ అక్క గారికి కొడుకు పుట్టాడు. సంతోషం. ఆస్థాన నర్తకిని రాజసేవకురాలిని కాబట్టి నేను నర్తించి తీరాలి. అది రాజధర్మం. కాకుంటే తల తీసేసారు. నిజానికి నేనే ఆ పదవినుండి తొలగిపోదామనుకున్నాను. ఇంతలోనే తొందరపడి మీరు

తీసివేశారు. ఏమయితేనేం మీ ఔదార్యం మీరు ప్రదర్శించారు. కాని ఒక్కటి ఆలోచించండి-

ముమ్మడమ్మ. రుయ్యమ్మలు ఎలాంటి స్త్రీలో నేనూ అలాంటి స్త్రీనే। మీకు మానవ వాంఛలు ఎలావున్నాయో నాకూ అలాగే వున్నాయి. అధికారం వుందికదా అని వాటిని అణచివేస్తే ధర్మం ఎక్కడుంది ?

పేదల కోపం పెదవికి చేటన్నట్లు ఏమీ చేయలేననేకదా మీరు నన్ను సోమేశ్వరునికి దూరం చేసింది? సోమేశ్వరుడికి దూరం కావడంతో మానసిక రుగ్మతపట్టుకుంది.

ఫలితంగా నర్తించలేక పోయాను.

నర్తించలేదని పదవి తొలగించారు.

అనాదరం ప్రకటించారు.

ఏదో కళ్ళ నీళ్ళు తుడవడానికా అన్నట్లు ఓ ఇల్లూ, యింత భరణం యిచ్చి ఓ వైద్యుణ్ణి చూపించారు.

రుయ్యమ్మా! ఇది నీకు ధర్మమా?? ఒక రాజకుమార్తెగాకాక ఒక స్త్రీగా ఆలోచించు-

నీవు సోమేశ్వరునివద్ద చేరి గుసగుసలాడుతున్నప్పుడే అనుకున్నాను-ఏదో ముప్పు ముంచుకొస్తున్నదని. కాని, నీవు యింతకు తెగించావని అనుకోలేదు. ఒక స్త్రీగా ఇంతకంటే ఏమి చెప్పను?" అని భోరున ఏడ్చాను.

రుయ్యమ్మ స్థాణువులా నిలబడి పోయింది. కొంతసేపటికి నా వుద్వేగం తగ్గింది.

వెక్కిళ్ళు ఆగిపోయాయి.

అప్పుడు మెల్లగా రుయ్యమ్మ యిలా మొదలు పెట్టింది.

"కామసాని! నీకు నేను తీరని అన్యాయమే చేశాను. నీవు నన్ను ఎన్ని విధాల అపార్థం చేసుకోవాలో అన్ని విధాలా చేసుకున్నావు. పోనీ దానికేం. పైన పరమేశ్వరుడున్నాడు. భూమిమీద నేనున్నాను. శాంభవీ దీక్ష పొందిన పవిత్రురాలిని. స్వయంభూసేవకు

రాణిని. నా చిత్తశుద్ధి శివునికి తెలుసు. నీవు ఏమనుకున్నా నాకు బాధలేదు.

నిజానికి ఒక రాజకూతురుతో ఒక పాలితురాలు అనకూడని మాటలన్నీ అన్నావు. అంతేకాదు ఒక స్త్రీతో మరొక స్త్రీ కూడా అనకూడని మాటలన్నావు. నేను ఇందులూరి అన్నయామాత్యుల ధర్మపత్నిని. అభిజాత్య గౌరవం కలదాన్ని. అలాంటిని నన్ను అనుమానించి అవమానించావు. అయినా నేను నిన్ను ఏమీ అనను కామసానీ!

ఎందుకంటే నీమీదా, సోమేశ్వరుని మీదా నాకుగల అభిమానం అలాంటిది! అయితే నీకు అర్థంకాని విషయం ఒకటివుంది. సోమేశ్వరునినుంచి నిన్ను నేనెందుకు దూరంచేశానూ. అని?!

ఇది కొంచెం జాగ్రత్తగా ఆలోచించవలసిన విషయం. ఎట్టి అపార్థానికీ తావు యివ్వకుండా ఆలోచించు కామసానీ!!

సోమేశ్వరుడు దైవాంశ సంభూతుడు.

కారణ జన్ముడు.

ఒక విధంగా నీవూ కారణ జన్మురాలివే! నీవు రాజకుటుంబానికి కాంచీపురంలో చేసిన సేవకూడా తక్కువదికాదు.

కాని నీ వుపాధి పార్థివం.

అంటే శరీరాన్ని అంటిపెట్టుకున్న కళ నీది. శరీరంతోనే దానికి చ్యుతీ, గతీ వుంటాయి.

లలిత కళలన్నిటిలోకీ కవిత్వం ఎక్కువ కాలం నిలుస్తుంది. ఎందుకంటే అది శబ్దాన్ని ఆశ్రయించుకున్నది కాబట్టి. తర్వాత నిల్చేది శిల్పం. మిగిలిన చిత్రలేఖనం, సంగీతం, అభినయం మూడూ శాశ్వతాలుకావు. ఎందుకంటే వాటి వుపాధులు తాత్కాలికాలు.

ఈ దృష్ట్యా నీకళ దైవ దత్తమయినదైనా అది శాశ్వతంగా నిలువదని నాకు తెలుసు. కాని సోమేశ్వరుని కళ అలా కాదు.

కామసానీ! మరో పాతికేళ్ళకు నీవూ, నేనూ ముసలి వాళ్ళమై పోతాము. ఆ తర్వాత మరో పాతికేళ్ళకు పరలోకానికి పోతాము. అంటే మరో వందఏళ్ళ తర్వాత ఈనాడు నీకంటికి కన్పడుతున్న ఏ

జీవి జీవించివుండదు. ఇది సృష్టి క్రమంలో తప్పించుకోలేని ఒక సత్యం. ఈ సృష్టి నిరంతర పరిణామశీలి అందులో మనం నశించక తప్పదు. నీవూ, నేనూ, మా అక్కా, మా అమ్మగారూ అందరూ నశించిపోతారు. అలాగే కాలక్రమంలో సోమేశ్వరుడు కూడా నశించి పోతాడు.

ఈ చ్యుతిని ఎవరూ ఆపలేరు.

అయితే నాకొక కోరిక వుంది.

సోమేశ్వరుడు నశించిపోనాదని.

క్షణికమైన ఈ శరీరానికి అది ఎలా సాధ్యం??

అతడు అమరత్వం కళద్వారా పొందగలడు.

అతని శిల్పసృష్టి యుగ యుగాలకూ నిలిచి వుండగలదు.

అందుకై అటు సోమేశ్వరుడూ, ఇటు నీవూ, కొన్ని త్యాగాలు చేయక తప్పదు. వివాహం చేసుకొని అవసరమైతే కళాప్రదర్శనకు దూరంగా మామూలు జీవితంలో స్థిరపడాలని మీరు సంకల్పించారని విన్నాను. సోమేశ్వరుడు నీతో సామాన్య కుటుంబ జీవనంలో మునిగి పోతే యిక అతడి ఉలి పనిచేయదు. నీ కర చరణాలు నర్తించవు సభా ముఖంలో. నీ నృత్యం కేవలం నీ భర్తకు మాత్రమే అంకితం అవుతుంది అప్పుడు.

అది అనుభవంద్వారా మేము ఊహించాము. అందుకని నేను ఒకటి ఆలోచించాను. నీ కుటుంబ జీవనాన్ని ఆటంకపరిచి యిటు నిన్నూ అటు సోమేశ్వరుణ్ణీ చరిత్రలో శాశ్వతంగా నిలబెట్టాలని అనుకున్నాను. ఒకవిధంగా యిందులో నా స్వార్థంకూడా వుంది. సోమేశ్వరుణ్ణి నేనూ హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. అయితే అది నీవనుకునే శారీరక ప్రేమ కాదు. అంతకంటే వున్నతమైనది. నీకు చెపితే అర్థంకాని ప్రేమ అది. పోనీ నీకు లౌకిక పరిభాషలోనే చెప్పాలంటే-సోమేశ్వరుడు నా సోదరుడనుకో.

ఇప్పుడు తీరిందా నీ అనుమానం?

కామసానీ!!

సోమేశ్వరుడు అమరుడు కావాలి.

అతడితోబాటు మన కాకతీయ శిల్పంకూడా చిరస్థాయిగా చరిత్రలో మిగిలిపోవాలి. ఇందుకోసం నేనొక జంటను తీరని బాధకు గురిచేశానని నాకు తెలుసు. కాని గత్యంతరంలేదు.

శివాచార్యులు కాదు. నేనే సోమేశ్వరుణ్ణి మందడ గోళకీ శిల్ప నిర్మాణానికై పంపుతూ మా అమ్మగారి పేర ఆజ్ఞాపత్రం పంపాను. మా పూర్వీకుల నిర్మాణాకాంక్ష సహస్ర మంటప శిల్పరూపంలో సజీవంగా ఉండాలని నేనే సంకల్పించాను. నేను చెప్పానంటే బాగుండదు కనుక మా తాతగారి పేరుమీద చెప్పించాను. కామసానీ! నేను జన్మసిద్ధంగా క్షత్రియ కన్యను. కాని ఇందులూరి వంశంతో సంబంధం జరగడంతో నాలోని క్షాత్రం నశించి బ్రాహ్మ్యం ప్రవేశించింది. నేనిప్పుడు బ్రాహ్మణ స్త్రీగా మాట్లాడుతున్నాను. సాత్విక స్వభావంతో నిండిన నా మాటలు నీ కెలా అర్థమవుతాయో తెలియదు. నీవెలా అర్థంచేసుకున్నా నేను బాధపడను.

నీకు జరుగరాని అన్యాయమే జరిగింది. ఆ అన్యాయం జరగడం కేవలం కాకతాళీయం. సోమేశ్వరుని ప్రేయసీ స్థానంలో మరొకరున్నా వారికీ యీ బాధ తప్పేదికాదు.

అందుకు నా సంకల్పమే కారణమా?

చెప్పు కామసానీ?

శాంతంగా ఆలోచించి చెప్పు?

సోమేశ్వరునికి లోకాతీత శక్తులివ్వడానికి నేను కారణమా?! అతణ్ణి నీవు ప్రేమించడానికినేను కారణమా? అతడు మా ఆస్థానంలో ప్రవేశించడానికి నేనే కారణమా?

ఇవన్నీ దివ్య సంకల్పాలు!!!

కేవలం సోమేశ్వరుని దృష్టి శిల్పంనుండి సంసారంలోకి మరల్చకుండా అడ్డుపడిన సంఘటనకు మాత్రం నేనే కారణం!

కామసానీ!

నేను నిన్ను చేయమని కోరుతున్న త్యాగం చాలా మహత్తరమైనదే!

ఒక స్త్రీ మరొక స్త్రీని కోరకూడనిదే-

అయినా కోరుతున్నాను.

అం. ీ కేవలం నాకోసం కాదు. సోమేశ్వరుని కోసమే. ఈ త్యాగం నీవు చేయక తప్పదు కామసానీ!

మన సామ్రాజ్య చరిత్రకోసం నీవీ త్యాగం చెయ్యి. ఇది నాకే కాదు. నీ ప్రేమకూ ఒక పరీక్షే! నీ ప్రియుని అమరత్వంకోసం నీవీ త్యాగం చేయ లేవా కామసానీ?"

"అయితే సోమేశ్వరుడు శిల్పనిర్మాణం పూర్తిచేసిన తర్వాత గృహస్థ జీవితంలో స్థిరపడకూడదా?"

"పడవచ్చు! కాని ఆ శిల్పనిర్మాణం ఎన్ని దశాబ్దాల కాలం నడుస్తుందో ఎవరు చెప్పగలరు?"

ఆ మాటలు విని కెవ్వున కేక వేసి నేను మూర్ఛపోయాను. ఆ తర్వాత రుయ్యమ్మ...." ఇంకా ఏదో చెప్పబోయి కామసాని అదృశ్యమైంది.

పదిహేను నిమిషాలు అయిపోయాయి. మాధవరావు బల హీనంగా లేచాడు.

# 15

మాధవరావును బ్యాంకు వుద్యోగంనుంచి సస్పెండు చేసి ఎంక్వైరీ పెట్టారు.

మతిలేకుండా ఆయన చేసిన పనివల్ల కొన్ని లెక్కలు తల్లక్రిందులైనాయి. దానివల్ల బ్యాంకుకు కొన్నివేలమీద కాష్‌లో తేడా వచ్చింది.

లక్ష్మి లబోదిబోమని ఏడిచింది.

రాం. కాత్యాయనులు కూడా కంట తడిపెట్టారు.

"ఆయన చేస్తూన్న ప్రతి మతిమాలిన పనినీ మీరు ప్రోత్సాహిస్తూ వచ్చారు. పూర్ణిమ కాకముందే ఆయన్ను తొలుకోని మీరా

పాడుబడ్డ మంటపానికి పోవడం. ఆయన చేసే పనేదో చంద్రమండల యాత్రలాగా భావించి మీరు మద్దత్తు నివ్వడంతో యింతపని జరిగింది" అని కాత్యాయని మొగుణ్ణి తీవ్రంగా విమర్శించింది.

"ఇది చంద్రమండల యాత్ర కాకపోయినా అలాంటిదే కాత్యాయనీ! ఎనిమిదివందల సంవత్సరాలకు పూర్వం జీవించివున్న వ్యక్తి మనతో స్వయంగా మాట్లాడుతూ ఆనాటి సాంఘిక, రాజకీయ, మత పరిస్థితులనన్నిటినీ వివరిస్తున్నది. మాధవరావు తాను కామసానితో జరిపిన సంభాషణ మొత్తం ఏ రోజుకారోజు నాకు చెపుతుంటే నేను దానిని రికార్డుచేసిపెట్టి ఆనందరావుతో చర్చలు జరుపుతున్నాను" అన్నాడు రామచంద్రరావు.

"నిజమే లెండి! ఎద్దు కంటికి పుండైతే కాకికేం నొప్పి?" అన్నది కాత్యాయని.

"ఇదుగో. నువ్వు అనవసరంగా నన్ను ఆడిపోసుకోకు. మాధవ్‌మీద లక్ష్మికున్నదానికన్నా నాకు ఎక్కువ ప్రేమ వుంది. స్వంత అన్నదమ్ములం కాకపోయినా, రక్తస్పర్శకన్నా ఎక్కువ ప్రేమ బాంధవ్యమే మాది."

"ఆ! మీ బాంధవ్యం కనపడుతూనే వుంది. పది హేను వందలరూపాయల నిక్షేపంలాంటి వుద్యోగం ఊడింది. దయ్యమో తెలియదు భూతమో తెలియదు. దాని వలలో పడ్డాడాయన. ఇక లక్ష్మి గతి ఏంకాను? వరంగల్ స్టేషన్ రోడ్‌లో జ్వాలాపతి లింగశాస్త్రిగారున్నారట. అట్లాంటివాడెవరినైనా పిలిచి డబ్బుకు వెనుదీయకుండా మంత్రచికిత్స చేయించండి మొర్రో అని నేను నెత్తిని నోరు పెట్టి మొత్తుకుంటున్నాను మొదటినుంచీ. నా మాట వినలేదు. చివరికిట్లా ముంచుకొచ్చింది" అని కంట తడి పెట్టింది కాత్యాయని.

"కాత్యాయనీ! మనకు పన్నెండవ శతాబ్దానికి సంబంధించిన అనుమానాలు కొన్ని వున్నాయి.

ఆనాటి మాండలిక భాష ఎలా వుండేది? రుద్రమదేవి గణపతి దేవుని కుమార్తై ఔనా-కాదా? రుద్రదేవుడు ఎలా చనిపోయాడు?

రుద్రదేవునిపీఠికి అతడి తమ్ముడు మహదేవుడు తిరుగుబాటు చేశాడని అంటున్నారు చరిత్రకారులు. ఇది ఎంతవరకు నిజం??

ప్రతాపరుద్రుడు ఎలా చనిపోయాడు?? గణపతిదేవుని కాలంలో తిక్కన ఎందుకు ఏకశిల వచ్చాడు? పాల్కురికి సోమనాథుని కాలం ఏమిటి??

గణపతిదేవుడు పరిపాలనకు వచ్చేసరికి కళ్యాణ కటకంలో బసవేశ్వరుడు లింగైక్యం చెందాడా—లేదా?? ఇలా ఎన్నో ముఖ్యమైన చరిత్రకాంశాలు తెలుసుకోవలసినవి వున్నాయి.

అవన్నీ తెలుసుకునేందుకు మాధవరావును వేయి స్తంభాల గుడికి పంపడం తప్ప వేరే మార్గం కనబడటంలేదు" అన్నాడు రామచంద్రరావు.

"నిజమే! ఇళ్ళు కాలిపోతుంటే మీబోటివాడే పేలాలు వేయించుకొని తింటున్నాడట వెనకటికి. అటు మాధవరావు దిన దినమూ క్షీణించిపోతున్నాడు. మీరేమో పాల్కురికి సోమనాథుని కాల నిర్ణయంగూర్చి ప్రయోగాలుచేస్తూ కూర్చోండి. పూర్తిగా చేతులు కాలాక ఆకులు పట్టుకొని ఏంలాభం?" అన్నది కాత్యాయని.

"నీవు చెప్పేమాటల్లో నిజం వుంది. కాని ఏంచేయను? నేను హిస్టరీ టీచరును. చరిత్రనిర్మాణంలో నాకు కొంత బాధ్యతకూడా వుందిగా" ఈ మాట విని కోపంతో కాత్యాయని భర్తవైపు క్రూరంగా చూచి విస విసా నడుచుకుంటూ వంటగదిలోకి వెళ్ళిపోయింది.

మాధవరావు దాదాపు వున్మత్తువిలా తయారైనాడు. రాత్రింబవళ్ళు "కామసానీ - కామసానీ" అని కలవరిస్తున్నాడు. కూతురు దగ్గరికి వచ్చినా లక్ష్మి దగ్గరికి వచ్చినా గుర్తుపట్టడం లేదు. "నేనే బళ్ళాల సోమేశ్వరుణ్ణి. నీకు అన్యాయం చేశాను కామసానీ" అంటూ దుఃఖిస్తున్నాడు.

పూర్ణిమ సాయంత్రమే కాకుండా ప్రతిరోజు సాయంత్రం వెళ్ళి శిధిలమంటపంలో కూర్చుంటున్నాడు.

సాయంత్రం అలా వెళ్ళి కూర్చొని ఏ పని కొట్టిన తర్వాతనో ఇంటికి వస్తున్నాడు.

ఒక్కోరోజు రాకపోతే రామచంద్రరావో, లక్ష్మో వెతుక్కుంటూ పోయి బలవంతంగా ఇంటికి తీసుకు వస్తున్నారు.

గోపాలస్వామి గుడివద్ద వేణుగోపాలాచార్యులని ప్రసిద్ధ ఆయుర్వేద వైద్యుడున్నాడు. క్రానిక్ డిసీజెస్ కూడా ఆయన నయం చేస్తాడు. రాం వెళ్ళి గోపాలాచార్యుల వారిని పిలుచుకొని వచ్చాడు. ఆయన వచ్చి పరీక్షించి చూచి "ఈయనలో ఉన్మాద లక్షణాలు కనబడుతున్నాయి. ఇది హిస్టీరియా కిందికి మారే అవకాశం చాలా ఎక్కువగా వుంది. బొత్తిగా నరాల బలం తప్పిపోయింది." అని చెప్పి కొన్ని లేహ్యాలూ, చూర్ణాలు ఇచ్చి వెళ్ళాడు.

వేణుగోపాలాచార్యులవారు చెప్పిన విషయం లక్ష్మికి తెలియకుండా దాచాడు రాం॥

ఈలోగా పూర్ణిమ వచ్చింది.

"పోనీ, ఈసారికి విశ్రాంతి తీసుకో మాధవ్! మరీ బలహీనంగా వున్నావు" అన్నాడు రాం.

"నెలరోజులుగా ఎదురు చూస్తున్న శుభదినమిది. ఈ పదిహేను నిమిషాల కోసం ముప్పైరోజులుగా తపన పడుతున్నాను. నా కామసానికి నన్ను దూరం చేయకండి" అని గట్టిగా అరిచి రాం చేతుల్లోంచి బలవంతంగా విడిపించుకొని వీధిని పడ్డాడు మాధవ్ —

చంద్రోదయం వేళకు మాధవ్ గుడికి చేరాడు. కొన్ని కొన్ని చరిత్రకాంశాలను అడిగి తెలుసుకో వలసిందిగా మాధవ్‌తో చెప్పి పంపాడు రాం.

చంద్రోదయమైంది.

కామసాని ప్రత్యక్షమైంది.

"సోమూ! మందడలో గోళకి మఠనిర్మాణం కొంత ముగిసింది. నీవు ఏకశిలకు వచ్చావని తెలిసింది. నా కోసం వస్తావని ఎదురుచూశాను. రాలేదు. దానితో నీకూ నామీద అనుగ్రహం తప్పిపోయిందని గ్రహించాను. నన్ను నేనే తిట్టుకున్నాను. ఎందుకొచ్చిన జన్మమిది?

అడవి కాచిన వెన్నెల!!

సోమూ! రుయ్యమ్మ చేసిన ధర్మోపన్యాసం ఎంత గొప్పదైనా ఆదర్శప్రాయమైనా నేనా స్థాయికి మానసికంగా ఎదగలేదు. రుయ్యమ్మ ఈ విషయాలు నాకు చెప్పింది. ఒకవేళ నా స్థానంలో తాను వుంటే అప్పుడేమై వుండేది? ఎలా ఆలోచించి వుండేది??

ఏమో! అమె. ఇందులూరి అన్నయ్యగారు నిరంతరం రాజకీయాలలో మునిగి తేలుతూ వుండే సామ్రాజ్యం కోసం సాంసారిక జీవితాన్ని చాలా భాగం త్యాగం చేస్తూ వుండవచ్చు.

అలాంటి పాక్షిక త్యాగం నేను చేయలేనా??

కనీసం కల్యాణ వేదికకే నోచుకోలేదే నేను!

అయితే నాది పూర్ణ త్యాగమా??

జీవితాంతం ఒక బౌద్ధ సన్యాసినిలా జీవించేందుకు నామనస్సు సిద్ధంగా లేదు.

సోమూ! ఆమాటే నీతో అన్నాను పద్మాక్షి మందిరంవద్ద!!

నీవు నన్ను కలుసుకోవడానికి రావని తెలిసిపోయింది. అందువల్ల నేనే ప్రయత్నించి నీ ఉనికిని గూర్చి ఆచూకీ తీసి నీవు పద్మాక్షి మందిరానికి వస్తున్నావని తెలుసుకున్నాను.

శరీరం కులాసాగా లేదు.

అయినా వచ్చాను.

పద్మాక్షి మందిరం పక్కన వున్న కొన్ని దిగంబర జైన విగ్రహాలను వీరభద్ర విగ్రహాలుగా ఆశ్వయుజ కార్తీక మాసాల ఉత్సవాలలో పలే చేయాలని రాణిగారు సంకల్పించి నన్ను పిలిపించినట్లు తెలిసింది.

గుడివద్ద నన్ను చూచి నీవు దిగ్భ్రాంతుడివైనావు. నేను నవ్వి అన్నాను "మనిషినే - దయ్యాన్ని కాను"

"కావచ్చు. కాని ఎందుకిక్కడికి వచ్చావిప్పుడు?"

"ఏం రాకూడదా?"

"నేను వస్తున్నానని నీకు తెలిసిందా?"

"ఔను!"

నీవు అప్పుడు మౌనం వహించావు.

"ఎం! నిన్ను చూచేందుకు కూడా నేను నోచుకోలేదా సోమూ!"

"అది కాదు కామసాని!——"

"అవును నేను కామసాని స్థానానికి దిగి పోయాను. దేవి స్థానంనుంచి"

బోరున ఏడ్చాను.

నా కన్నీళ్ళు చూచి నీవు తొట్రుపాటు చెందడం గమనించాను.

"విధి చాలా క్రూరమైనది దేవీ! ఒక్కొక్కప్పుడు వ్యక్తి సంకల్పానికి అతీతంగా పరిస్థితులు వస్తుంటాయి"

"వచ్చిన విచిత్ర పరిస్థితులను వ్యక్తి తనకనుగుణంగా తీర్చి దిద్దుకోవడాన్నే పురుషార్థం అంటారు సోమూ! నీకంతటి ప్రమాదకరమైన పరిస్థితి ఏమి వచ్చిందని నన్నుచూడడం మానివేశావు? బహుశా రాజాజ్ఞ కారణం కావచ్చు. ఔనా?"

నీవు మౌనం వహించావు.

"నిజమేనా?"

"కొంతవరకూ నిజం!"

"అయితే నా అనుమానం నిజమైంది. ఆ రాక్షసి రుయ్యమ్మ నిన్నూ నన్నూ ఇలా దూరం చేపించదన్నమాట!"

"అంతమాట అనకు దేవీ! నేను మానసికంగా ఎలాంటి తీవ్ర సంఘర్షణకు గురి ఔతున్నానో నీకు చెప్పకూడదు. కాని రుయ్యమ్మ కోరిక వెనుక ఒక ఉదాత్త ఆశయం వుంది లౌకికమైన మన ప్రేమ జీవితంవల్ల మరో చిన్న సోమేశ్వరుడు పుడతాడు. నీవూ నేనూ ఆ బంధాలలో పడి కొట్టుకుంటాము. కాని శిల్పాలకు శిందిరిని కావాలని రుయ్యమ్మ కోరిక. మహాత్యాగాల వల్ల, తపస్సువల్లనే కాని మహాఫలితాలు సాధింపబడవు. దేవీ! నీవు కూడా నీ నృత్యాన్ని ఎందుకు ఉద్యాంకితం చేయకూడదు?"

"సోమూ—సోమూ—మాటలు నేర్చిన చిలకలాగా రుయ్యమ్మ నీకు బోధించిన పాఠాలను నాదగ్గర వల్లించకు. నేనాస్థాయికెదగలేను. నృత్యాని కంకితమైన దేవదాసిలాగా నేను జీవించలేదు.నాకు వైవాహికజీవితం కావాలి."

"అయితే?...."

"ఆఁ! ఏమిటి సోమూ అయితే? మరెవరినైనా చేసుకోవి సుఖపడమని అనబోతున్నావా?? నీ నాలుక ఎంతమాట అనేందుకైనా తెగి-పడదని నాకు తెలుసు...."

"లేదు దేవీ! అయితే.... ఇక పరమేశ్వర సంకల్పం ఎలా వుంటుందో కాని మానవ ప్రయత్నంలో ఏమీ లేదని అనబోయాను" అన్నావు నీవు.

నీవు విశాలమైన శిలావేదికమీద కూర్చున్నావు.

నీకు ఎదురుగా శోకమూర్తిలా కూర్చున్నాను నేను. అప్పుడు నీవేమన్నావో నీకు గుర్తుందా సోమూ?"

"లేదు...." అన్నాడు మాధవరావు.

అప్పుడు నీవన్నావుకదా.... "దేవీ!....నేను యశోధర చిత్రాన్ని వేయిస్తంభాల గుడిలో చిత్రిస్తాను." అని. అదివిని నేను విషాదంగా నవ్వాను.

మనబతుకెలా వుందో నీ కోరికా అలాగే వుంది సోమూ!

"వీరశైవం అధికారమతంగా వున్న రాజ్యంలో బౌద్ధమతపైన శిల్పం నీవు చెక్కడం ఓ హో హో...."అన్నాను నేను.

అప్పుడు నీవన్నావు "ఏ మతమైతే ఏం కాని. మానవీయమైన లక్షణాలు అందరిలోనూ ఒకటే కదా! నాకెందుకో యశోధర చాలా గొప్పదని అనిపిస్తుంది దేవీ! బుద్ధుడు సర్వసంగ పరిత్యాగి అయినాడు ఆదర్శపురుషుడైనాడు. తాను చేసిన త్యాగానికి లక్ష రెట్లు కీర్తి ప్రతిష్ఠలూ పొందాడు. వాటిని ఆయన ఆశించి ఆ త్యాగం చేయక పోవచ్చు. కాని లభించాయి. అయితే యశోధర మాటేమిటి?

ఆమె సంఘర్షణ ఎందరు గమనించారు?

యశోధర అంటే నాకెంతో ఇష్టం!

వేయి స్తంభాల గుడిలో ఆమె మూర్తిని చెక్కుతాను"

సోమూ! పరోక్షంగా నీవు నన్ను పొగుడుతున్నావని గ్రహించాను. యశోధర పేర నా మూర్తిని వేయి స్తంభాల గుడిలో చెక్కుతానని నీవు చెప్పదలచినట్లు నేను గ్రహించాను.

ఇంతలో ఆలయ శిల్పసందర్శంకోసం అధికారులు కోటనుండి వచ్చారు.

నీవు లేచావు.

నేను కన్నీళ్ళతో పద్మాక్షి గుడి దిగిపోయాను.

ఆ తర్వాత-

ఆ తర్వాత నా ఆరోగ్యం బాగా క్షీణించింది.

పద్మాక్షి శిల్పాలు పూర్తి చేసి తిరిగి మందర వెళ్ళినట్లు

ఈ లోగా రాజప్రాసాదంనుండి నా స్థానంలో తిరిగి మా అమ్మను ఆస్థాన నర్తకిగా నియమించ దలచినట్లూ, అంగీకారం తెలపవలసిందని శ్రీ ముఖం వచ్చింది. ఈ విషయం మా అమ్మ నాతో చెప్పింది.

రుయ్యమ్మ తన ఔదార్యాన్ని మళ్ళీ ప్రదర్శించుకుంటున్నది.

"మంచిది! ఇంకేం వెళ్ళు రాజ కుమార్తెల ముందు ఛెంగు ఛెంగుని గెంతవచ్చు" అన్నాను నేను.

"మీ ఆదరానికి కృతజ్ఞురాలని. కాని వయోభారంవల్ల నేనా బాధ్యతకు తగను" అని మా అమ్మ తిరిగి సమాధానం పంపించింది.

కొంతకాలం గడిచింది.

ఒకనాడు మా అమ్మ నాతో చెప్పింది- "మందరలో శిల్పాలు పూర్తి అయినాయి. కాని రుయ్యమ్మ ఆశించిన ప్రయోజనం మాత్రం తల్లకిందులైంది.

మీ ఇరువురిని వేరు చేసి ఇదరినీ కళాతపస్వులుగా చేద్దామని ఆమె సంకల్పమట! కాని నీవిట్లా రోగగ్రస్థవైనావు. అక్కడ సోమేశ్వరుడూ అన్యమనస్కుడైనాడట! శిలల మీద ధ్యానం నిలపలేక పోతున్నాడట!!...."అని.

ఈ వార్తవిని దుఃఖించాను.
స్పృహ కోల్పోయాను.
ఆ తర్వాత....ఆ తర్వాత సంఘటనలు కలలో జరిగినట్లుగా జ్ఞాపకం....ఎందుకో శివాచార్యులవారు వచ్చినట్లు-నన్ను అభిమంత్రిస్తున్నట్లు....ఆ తర్వాత....
మళ్ళీ....సోమూ! నిన్ను చూస్తున్నాను.
నీతో మాట్లాడుతున్నాను." అని కామసాని పెద్దగా ఏడ్చింది....ఒకే సారి యాభై విపంచికలు మీటినట్లు ఏడ్చింది.
వెంటనే మాధవరావు మానసికోద్రేకాన్ని భరించలేక స్పృహ తప్పి పడిపోయాడు. శిథిల మంటపంలో కామసాని ముందు.
కామసాని అదృశ్యం కాలేదు—
ఇంకా పదిహేను నిమిషాలూ కాలేదు!!

# 16

రామచంద్రరావు పి. జి. సెంటర్‌కు వెళ్ళాడు ఉదయమే.
ఆనందరావు 'రండి-రండి' అని ఆదరించి కాఫీ ఇచ్చాడు.
ఇద్దరూ ఆనందరావు స్టడీ రూంలో కూర్చున్నారు.
"ఈసారి విచిత్రమైన సంఘటన జరిగింది. కామసాని అదృశ్యం కాకముందే మాధవరావు స్పృహతప్పి పడిపోయాడు. ఎంతకూ రాకపోయేసరికి నేను తొమ్మిదిగంటల ప్రాంతంలో లోపలికి వెళ్ళాను. మాధవరావు అక్కడ బండలమీద పడుకొని వున్నాడు. స్పృహలేదు. ఇంటికి తెచ్చాను. ఒక రోజంతా మగతగా మన లోకంలోనే లేడు. నిన్నరాత్రి కళ్ళు విప్పి జరిగిన సంగతి చెప్పాడు-"
అని రామచంద్రరావు మాధవరావుకు కామసాని చెప్పిన కథను ఆనందరావుకు చెప్పాడు.

ఆనందరావు శ్రద్ధగా విన్నాడు.

"ఇప్పుడు మనకిందులో కొన్ని సందేహాలు కలుగుతున్నాయి. వాటికి సమాధానాలు రావలసివుంది. కాగా చరిత్రలో మనకు వచ్చిన కొన్ని అనుమానాలకు సమాధానాలు కామసానినుండి రాబట్టాలని ప్రయత్నించాముకదా—ఏమయింది?" అన్నాడు ఆనందరావు.

"అసలు వాటిని మాధవ్ అడగనేలేదట. ఆమెను చూడగానే ఏదో పరవశం. ఆమె మాటలు వింటుంటే ఏదో తన్మయత్వం—ఫలితంగా మాధవ్ ఆమెను ప్రశ్నించడమేలేదు—"

"అరెరే! అయితే మన ప్రయోగం పూర్తిగా ఫలించలేదన్న మాట! ఈ సారి పోయినప్పుడు అడిగేటట్లు చేద్దాము. లేదా ఈ సారి మీరో నేనో మాధవ్‌తో శిధిలమంటపంలో పక్కనే కూర్చొని అన్నీ అడిగిద్దాము—" అన్నాడు ఆనందరావు.

కాత్యాయని ఎద్దుకంటి సామెతా, పేలాల సామెతా చటుక్కున గుర్తుకొచ్చాయి రామచంద్రరావుకు.

"ఆనందరావుగారూ! మాధవ్ పరిస్థితి ఏమి బాగోలేదు. ఇక అతడు మంచంమీదినుంచి కదిలేటట్లు కూడా లేడు. ఏదో ఒక వైద్యం చేయించకపోతే మనిషి దక్కడం కూడా కష్టమే!" అన్నాడు రాం.

ఆనందరావు కొంచెంసేపు ఆలోచించాడు.

"ఇంతకూ మాధవరావుతో మాట్లాడుతున్న కామసాని ఎవరు? దయ్యమా? లేక మరేదైనా భ్రమా?" అన్నాడు ఆనందరావు.

"ఆమె చారిత్రక వ్యక్తిలాగే కన్పడుతూ వుంది."

"కావచ్చు. కాని నిజంగా కామసాని ఈ కథంతా మాధవరావుతో చెప్పిందా? లేక మాధవరావే శిధిల మంటపంలో కూర్చుంటే అలా ఊహలు వస్తున్నాయా?" అని అడిగాడు ఆనందరావు.

"ఇది మరీ అన్యాయంగా వుంది. తనే ఎవరితోనో మాట్లాడినట్లు ఎలా చెప్పగలడు! పైగా మాధవ్ హిస్టరీ స్టూడెంట్ కాదు. అతడు చెప్పిన కాంచీపుర విజయగండగోపాలుని యుద్ధమూ, దుయ్యమ్మ అన్నయ్యల పెళ్ళీ, మందడ గోళకీ మఠ నిర్మాణం-అన్నీ చరిత్రాత్మకమైన అంశాలే" అన్నాడు రాం.

ఆనందరావు గడ్డంకింద చేయిపెట్టుకొని అలాగే ఆలో చిస్తున్నాడు.

"మొత్తానికి అద్భుతమైన విచిత్రమిది. నేను నర్తించకపోతే 'ఈ ప్రతాపరుద్రునితోనే సామ్రాజ్యం ఏమైనా అయిపోతుందా ఏమిటి?' అన్నది కామసాని. సరిగ్గా అలాగే జరిగింది. అంటే కామ సాని కథ సరిగ్గా రెండవ ప్రతాపరుద్రుని జన్మ తిథి ప్రాంతంలోని దన్నమాట."

"కాబట్టి ప్రతాపరుద్రుని అస్తమయాన్ని గూర్చి మాలిక్‌కాఫర్ దండయాత్ర గూర్చి, అలూఫ్‌ఖాన్ వ్రాతలను గూర్చి, మాధవ్ కామ సానిని అడిగినా ఆమె చెప్పలేకపోవచ్చు. ఎందుకంటే ప్రతాప రుద్రుడు బహుశా క్రీ. శ. 1280 ప్రాంతంలో పుట్టి వుంటాడు. రుద్రమదేవి క్రీ. శ. 1298 ప్రాతంలో కాలంచేసింది. అదే సంవ త్సరం ఇతడు రాజ్యానికి వచ్చాడు. మాలిక్‌కాఫర్ దండయాత్ర క్రీ. శ. 1303 ప్రాంతంలో. అలూఫ్‌ఖాన్ క్రీ. శ. 1323 లో ఓరు గల్లును వర్ణించాడు. జియా ఉద్దీన్ బర్నీ ఎకౌంట్స్ దీనికి మనకు ఆధారం.

కాబట్టి కామసాని క్రీ. శ. 1260-80 మధ్యలో వున్నట్టు మనం ఊహించాలి.

ఈ ఊహే నిజమైతే మన మాధవరావు కూడా ఆ ప్రాతం లోనే ఖళ్ళాల సోమేశ్వరుడనే పేర ఒక శిల్పిగా కాకతీయ సామ్రాజ్యంలో ఉండివుండాలి. కాబట్టి 1260 ప్రాంతంలోని వ్యక్తి తన తర్వాత చారిత్రక విశేషాలు చెప్పలేకపోవచ్చు" అన్నాడు రాం.

"పోనీ తన సమకాలీన విశేషాలూ, రుద్రమదేవిని గూర్చి మనకు తీరని కొన్ని సందేహాలు తెలుసుకునే అవకాశం కూడా పోయిందే!" అన్నాడు ఆనందరావు.

"ఇంతకూ నా అనుమానమేమిటంటే మాధవ్‌ను కామసాని ఖళ్ళాల సోమేశ్వరుడని ఎలా గుర్తుపట్టిందీ అని?"

"ఇదీ ఆలోచించవలసిన విషయమే! అంటే ఇప్పుడు మన మాధవరావు రూపం ఎలా వుందో ఎనిమిదివందల ఏండ్లకు

ముందువున్న భళ్ళాల సోమేశ్వరుడు కూడా ఫిజికల్‌గా ఇలాంటి పోలి కలతోనే ఉండేవాడని మనం అనుకోవాలి. లేకుంటే కామసాని ఎలా పోల్చుకున్నది?"

"ఆమె పూర్ణిమనాడు సాయంత్రం పదిహేనువిమిషాలు మాత్రమే ఎందుకు కన్పిస్తున్నది?"

"అదీ తీరని సమస్యే!"

"చరిత్రలో ఒక అద్భుతం ఏమంటే వేయిస్తంభాల గుడి రుద్రదేవుని కాలంలో అంటే క్రీ. శ. 1164 లో ప్రారంభమైనట్లు చెప్పబడి వుంది. దానిని గణపతిదేవుడు పూర్తిచేయించాలని ప్రయత్నించినట్లు వ్రాయబడి వుంది. కాని, కాకతీయుల అసంపూర్ణ దేవాలయాల్లో వేయిస్తంభాల గుడి ఒకటి" అన్నాడు రాం.

"ఇంకేం, మన మాధవరావు చెప్పిన కథ సరిపోతున్నది. రుయ్యమ్మ ఆశించిన ప్రయోజనం నెరవేరకపోగా అది పూర్తిగా వ్యతిరేకంగా జరిగివుండవచ్చు. కామసాని వియోగంతో సోమేశ్వరుడు సహస్ర మంటప నిర్మాణంమీద దృష్టి పూర్తిగా కేంద్రీకరించలేకపోవచ్చు-"

"అయితే యశోధర చిత్రం ఏదో చెక్కుతాన్నానన్నాడే?"

"ఇప్పుడు మాధవరావు వెళ్ళి కూర్చుంటున్న చోటున వున్న బొమ్మ ఆ యశోధర శిల్పమేనా?"

"యశోధర-అంటే సోమేశ్వరుని దృష్టిలో కామసాని అనే అర్థం చెప్పుకోవాలి-"

"అయితే మన మాధవరావుకు కన్పించే కామసాని ఆ శిల్పం పక్కనుండి కాని, కిందనుండి కాని, లేదా లోపలినుండి కాని వస్తుండాలి."

ఆనందరావు అన్న ఈ మాటలతో రాం ఉలిక్కిపడ్డాడు.

"మనకు ఈ విషయం ఎలా తెలుస్తుంది?"

"తెలియడం కష్టం. ఎందుకంటే ఇది మిస్టిక్ ఎఫైర్ కాబట్టి" అన్నాడు ఆనందరావు.

"వేణుగోపాలాచార్యుల వారి మందుకూడా పని చేయడం లేదు. మాధవ్ ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. సైకిక్‌గా తయారై

నాడు. మన మాటలు వినడు. మనవైపు చూడదు. భార్య వెళ్ళినా గుర్తుపట్టడం లేదు. అప్పుడప్పుడూ కూతురును మాత్రం గుర్తు పడుతున్నాడు. ఏదో శూన్యంలోకి చూస్తూ కూర్చుంటాడు. 'నా సుత్తి, ఉలీ ఎక్కడ?' అని కేక పెడుతుంటాడు. ఈ దురవస్థలకు తోడు ఉద్యోగం కూడా పోయింది" అన్నాడు రాం.

"పోనీ, మనమితని విషయం ఆర్కియాలాజికల్ డిపార్టు మెంటు వారికీ, పారా సైకాలజీ డిపార్టుమెంటుకూ తెలియపరిస్తే?" అన్నాడు ఆనందరావు.

"ఎందుకు?"

"వాళ్ళు వచ్చి మాధవ్‌ను పరీక్షలు చేస్తారు."

"చేసి?...."

"చేసి కరెంట్ షాక్ యిస్తారు. ఇతనికి మైండ్ చెడిపోయిందంటారు. హేతువాదానికి ఈయన నెరేషన్ నిలవదంటారు—"

"పోనీ ఆ ఎక్స్‌పరిమెంటుకూడా చేసి చూస్తే?"

"ఆఁ చూడవచ్చు-ఎద్దుకన్ను" అన్నాడు రాం.

"ఎద్దుకన్నేమిటి?"

"ఏమిటో మా ఆవిడ అన్నది" అని నవ్వాడు రాం.

"అంటే...."

"ఏమీ లేదులే! మీ మాట మాత్రం ఎందుకు కాదనాలి? ఎం.జి.ఎం.లో పారాసైకాలజీ స్పెషలిస్టులు ఉన్నారేమో కనుక్కుందాం" అన్నాడు రాం.

ఆ రోజే సైకియాట్రిక్ స్పెషలిష్టును వెళ్ళి రాం కలుసుకున్నాడు.

డాక్టర్ యాదగిరి-మనస్తత్వ శాస్త్రంలో విదేశాలలో ప్రత్యేక శిక్షణ పొంది వచ్చాడు.

విదేశాలలో స్పెషలిష్టులకు ఒక ప్రత్యేకమైన లక్షణం ఉంటుంది. ఏ జబ్బునైనాసరే వాళ్ళు తాము స్పెషలైజ్ చేసిన అంశం దృష్ట్యా మాత్రమే పరిశీలిస్తారు. యాదగిరి అలాంటి వాడేనని రాం తొలి సంభాషణలోనే గుర్తించాడు.

ఇప్పటివరకూ మాధవరావు పేరు ఆనందరావు, రాంచంద్ర రావులు చాలా రహస్యంగా దాచారు.

కామసాని కథ లోకంలో ఎవరికీ తెలియకుండా కాపాడారు.

చివరకు వేయి స్తంభాల గుడిలోని వాచ్‌మెన్‌కికూడా తెలియకుండా చేయగలిగారు.

ఇప్పుడీ యాదగిరి సవాలక్ష ప్రశ్నలు వేశాడు.

వాటన్నిటికీ రాం యుక్తాయుక్తంగా జవాబులు చెప్పాడు.

"మీరు పేషెంటు పేరూ, ఊసికీ, ఉద్యోగం చెప్పడంలేదు. జబ్బుల విషయంలో దాచి యేమీ ప్రయోజనం లేదు. చివరకు ప్రాణంపోతే మేము చేయగలిగింది ఏమీ లేదు" అన్నాడు యాదగిరి.

రాం కొంచెం మొగమాట పడ్డాడు.

"సమయం వచ్చినప్పుడు చెప్తాను. పేషెంటునే చూపుతాను. కాని ముందు నాకీ విషయంలో ఎనాలిసిస్ కావాలి. ఒక వ్యక్తి ఒక గుడిలోకి పోయినప్పుడు అక్కడ కొన్ని వందల సంవత్సరాల క్రితం జీవించి వున్న ఒక వ్యక్తితో మాట్లాడే అవకాశం వుందా-లేదా? చెప్పండి...."

"ఆ వ్యక్తి ఆడా, మగా?" అని అడిగాడు యాదగిరి.

"ఎందుకు?"

"ఎందుకంటే ఆడవ్యక్తి అయితే విశ్లేషణ ఒక రకంగా ఉంటుంది—మగవ్యక్తి అయితే మరో రకంగా ఉంటుంది"

రాం నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"ఏమీలేదు-ఒక పేషెంటు ఒక వైద్యుడి దగ్గిరికి చెవినొప్పితో పోయాడట! ఆ స్పెషలిస్టు అన్నాడట- 'నేను కుడిచెవి స్పెషలిస్టును. నీ జబ్బు కుడి చెవికా? ఎడమ చెవికా' అని-నాకా జోక్ గుర్తొచ్చింది" అన్నాడు రాం చిరునవ్వుతో.

"ఇది జోక్ కాదు రామచంద్రరావుగారూ! సైన్సు. ఆడవాళ్ళ హిస్టీరియా కారణాలకు, సైకో ఎనాలిసిస్ ఒక రకంగా వుంటుంది. మగవాళ్ళకు మరోరకం. స్త్రీలకు అత్తలవల్ల, ఆడబిడ్డలవల్ల కష్టాలు

వస్తాయి. లేదా బాలింతరాలుగా ఉన్నప్పుడు నరాల బలహీనత వస్తుంది. కాన్పుకాన్పుకూ నీరస పడిపోతారు. దానివల్ల వాళ్ళ మానసిక పరిణామము, మానసిక వ్యాధులు వొక రకంగా వుంటాయి. మొగవాళ్ళు కొందరు తిరుగుబోతులుంటారు. దానివల్ల వారికి సుఖ వ్యాధులు రావచ్చు. కొన్ని సుఖ వ్యాధులు లాంగ్ రన్‌లో మైండ్ మీద పనిచేసి చిత్తస్వాస్థ్యాన్ని చెరుస్తాయి. ముఖ్యంగా గనేరియా-సిఫిలిప్ వంటివి. దానివల్ల ఆ రోగికి దయ్యాలూ భూతాలు కనపడుతూ వుంటాయి...."

రామచంద్రరావు హడలిపోయాడు.

"రామ-రామ! మా వాడు చాలా ఉత్తముడు సుమండీ-అలాంటి వ్యాధులేమీ లేవు."

"అలా చెప్పండి. అయితే ఈ పేషెంట్ మగవాడన్నమాట!"

"ఔను!"

"అతడి కేరక్టర్ మంచిదేనా?"

"నిప్పులాంటిది!"

"వాళ్ళ అమ్మా నాన్నల కారక్టరూ, వాళ్ళ అమ్మమ్మా తాతయ్యల కారక్టరూ, వాళ్ళ అత్తమామల కారక్టరూ ఎటువంటిది?"

"అమ్మ బాబోయ్! ఆ పెద్దల శీలాన్ని నేనెన్నడూ విచారించ లేదు. అయినా అంతంత పెద్దపెద్ద మాటలు నేను ఎవరినడిగి తెలుసు కోను? జబ్బు మా ఫ్రెండుకు"

"కావచ్చు. కాని జెనెటిక్స్ అని వొక శాస్త్రం వుంది. దానినే వంశానుగత లక్షణాలు అంటాము. మన పూర్వీకులలో ఒకరికి కుష్టు ఉంటే అది తర్వాత తరానికీ వచ్చే ప్రమాదం వుంది. అలాగే సిఫిలిస్ గనేరియా కూడా. మతి భ్రమణంకూడా అంతే. వంశంలో ఎవరికైనా మతిభ్రమణం ఉంటే అది తర్వాతి తరాలలో ఎవరికైనా వచ్చే అవకాశం ఉంది."

"నాకు తెలిసినంతవరకూ మా ఫ్రెండు కుటుంబంలో అందరూ సత్ప్రవర్తన కలవారే! ఏవరికీ మతిభ్రమణాలు లేవు."

"లేవంటే సరిపోదు. ఎవరైనా ఎక్సెంట్రిక్స్ ఉన్నారా?"

"అంటే?"

"అంటే తీవ్రధోరణి, మొండిపట్టూ-మూఢత్వం కల మనుష్యులున్నారా?"

"మూఢత్వానికీ ఈ దయ్యానికీ ఏమిటి సంబంధం?"

"బోలెడు సంబంధం వుంది—ఒకరి మూఢ లక్షణాలు వారి కొడుకుల్లో, కూతుళ్ళలో మరో రకమైన మూఢత్వానికి దారి తీయవచ్చు. అతివాద మానసిక లక్షణాలు డెవలప్ కావచ్చు. తమకు దేవుళ్ళు కనిపిస్తున్నట్టూ తాము స్వర్గంలో రాత్రిళ్ళు విహరించి వస్తున్నట్టూ భావించుకునే మనస్తత్వం లాంటిది—"

రాం అయోమయంలో పడ్డాడు.

"నీ స్నేహితుడు సిగరెట్లు కాలుస్తాడా?"

"ఆఁ—"

"ఎన్ని?"

"పరిమితంగా!"

"లెక్కబెట్టండి. విపరీతంగా కాలిస్తే దాని ప్రభావం మైండ్ మీద వుంటుంది. దయ్యాలు కనిపించడానికి అదీ ఒక కారణం కావచ్చు. లేక తాగుడు అలవాటు వుంటే అదీ దయ్యాలు కనిపించడానికి కారణమవుతుంది...."

"అలాంటిది లేదు."

"పోనీ, మీ స్నేహితుడు డిటెక్టివ్ నవలలు విపరీతంగా చదువుతారా?"

"ఏమో అడగలేదు."

"దానివల్లా దయ్యాలు కనిపించవచ్చు!"

"కాని మా స్నేహితుడికి కనిపిస్తున్న వ్యక్తి ఎనిమిదివందల సంవత్సరాలకు పూర్వపు వ్యక్తి."

"కావచ్చు. అంటే ఇది చాలా పురాతన దయ్యమన్నమాట!"

"అయితే దయ్యమేనంటారా?"

"దయ్యమని మా శాస్త్రం ఒప్పుకోదు. కాని...."

యాదగిరి కొంచెం ఆగాడు—ఒకసారి దగ్గాడు.

వక్కపొడి కాస్త నోట్లో వేసుకొని సిగరెట్ వెలిగించి ఓ దమ్ము పీల్చి మెల్లగా అన్నాడు-

"ప్రొఫెషనల్‌గా మా శాస్త్రం దయ్యాలను తిరస్కరిస్తుంది. కాని రామచంద్రరావుగారూ! పేషెంట్లతో మేము ఎన్నిమాటలు చెప్పినా వ్యక్తిగతంగా నాకు మాత్రం దయ్యాలమీద నమ్మకంవుంది సుమండీ!"

"చంపావురా దేవుడా!" అనుకున్నాడు రాం.

"బహుశా ఈ నమ్మకం మీ అనువంశిక లక్షణం కావచ్చు" అన్నాడు రాం.

"కావచ్చు—కావచ్చు—అన్నట్లు మీ మిత్రుడు పదమూడో శతాబ్దానికి చెందిన, లేదా పన్నెండో శతాబ్దానికి చెందిన చారిత్రక నవల ఎప్పుడైనా చదివివుంటే అది మనస్సులో జీర్ణించుకొనిపోయి కొన్నేళ్ళ తర్వాత ఏకారణం చేతనైనా మానసిక బలహీనత ఏర్పడితే తాను లోగడ చదివిన నవలలోని పాత్రలూ, వేషభాషలూ, సంభాషణలూ సజీవంగా కళ్ళ ఎదుట తిరుగుతున్నట్లు భ్రమ కలిగే అవకాశం కూడా వుంది—అలాంటిదేమైనా జరుగుతున్నదా? పరిశీలించండి!"

రాం అలాగే యాదగిరి ముఖం చూస్తున్నాడు అయోమయంగా.

"ఇలా చాలా చాలా అంశాలు పరిశీలించాలి. అందుకని ముందు మీ రోగిని తీసుకురండి. అతనిమీద అన్ని రకాల ప్రయోగాలూ చేద్దాము. కరెంట్ ట్రీట్‌మెంట్ కూడా చేద్దాము. మతిభ్రమణం అవునో కాదో నిర్ధారిద్దాము—"

"మతిభ్రమణమే అయితే?"

"అయితే-హైదరాబాదులో ఎర్రగడ్డ హాస్పటల్ లో చేర్పిద్దాము."

రామచంద్రరావుకు వణుకు పుట్టింది. ఇంతా చేసి చివరకు మాధవ్‌ను ఎర్రగడ్డపాలు చేయడమా??

'ఏమి ఖర్మరా దేవుడా!' అనుకొని "యాదగిరిగారూ! మళ్ళీ కలుస్తాను" అని రాం బయటపడ్డాడు.

# 17

మాధవరావుకు కరంట్ ట్రీట్‌మెంటు చేయించడానికి లక్ష్మి ససేమిరా ఒప్పుకోలేదు.

"నేను చావనైనా చస్తానుకాని నా మొగుణ్ణి పిచ్చాసుపత్రిలో చేర్చనివ్వను" అని పెద్దగా ఏడ్చింది లక్ష్మి.

రామచంద్రరావు, కాత్యాయినీ, ఆనందరావు, వేణుగోపాలాచార్యులూ అంతా కలిసి ఆలోచించారు. వేణుగోపాలాచార్యులు మాధవరావును పరీక్షించి వచ్చి అన్నాడు- "నేను చాలా మంచిమంచి మందులు ఇస్తున్నాను. స్వయంగా మా ఇంటివద్ద ఆవుపేడతో చేసిన పిడకలతో శుద్ధిచేసి సువర్ణం కలిపిన మందులివి. అయినా పని చేయడం లేదు. మనిషి ఉలికులికి పడుతున్నాడు—హిస్టీరియా లక్షణాలు కన్పడుతున్నాయి. నరాలు బొత్తిగా స్వాధీనంలో లేవు. ఇలాగే మరికొన్ని రోజులు గడిస్తే ప్రమాదం."

ఈమాటలు విని అంతా భయపడిపోయారు.

"అయితే ఏం చేయమంటారు ఆచార్యులవారూ? యాదగిరిచేత కరంట్ ట్రీట్‌మెంటు చేయిద్దామా?" అని అడిగాడు రాం.

"అది ఇంగ్లీషు వైద్యం. నేను ఆయుర్వేద వైద్యుణ్ణి కాబట్టి అది మంచిదనో, చెడ్డదనో ఏం చెప్పినా మీరు అపార్థం చేసుకునే అవకాశం వుంది. అయితే ఒకటి మాత్రం ఇంగ్లీషు వైద్యులే అంగీకరించారు- ఒకసారి కరెంట్ షాక్ ఇప్పిస్తే అది మనిషిలోనుంచి కొన్ని నెలల బలాన్ని గుంజివేస్తుంది" అన్నాడు వేణుగోపాలాచార్యులు.

"పోనీ స్థలం మారిస్తే?" అని అడిగాడు రాం.

"అదీ ప్రయోజనం లేదు—ఏ రాత్రికి రాత్రో రైల్లో పడి మాధవరావు వేయిస్తంభాల గుడికి వస్తాడు—ఈ అనారోగ్య పరిస్థితిలో అలా ప్రయాణం చేయడం ప్రాణానికే ప్రమాదం" అన్నాడు ఆచార్యులవారు. ఆనందరావు కొంచెంసేపు ఆలోచించి అన్నాడు కదా-

"మాధవరావు ఆకర్షణ మొత్తం కామసాని: ఆమె ఆ గుడిలో వుంది. గుడిలోని ఆ వ్యక్తి ఇప్పుడు మాధవరావు మనస్సులో

ప్రవేశించింది. అందువల్ల ఈయన మనస్సులోని ఆ భ్రాంతిని తొలగించాలంటే గుడిలో ఈయనకు కన్పడే ఆ వ్యక్తిని కన్పడకుండా మనం చేయగలిగితే తక్షణం ప్రయోజనం కలుగవచ్చు."

ఈ సలహా అందరికీ నచ్చింది.

అయితే గుడిలో కన్పడే వ్యక్తి స్వరూపం ఇలాంటిది అని నిర్ధారించడానికే వీలులేనప్పుడు, ఆ రూపం మాధవరావుకు కన్పడకుండా చేయడమెలా?

ఇదీ సమస్య!

"పోనీ జ్వాలాపతి లింగశాస్త్రిగారి వద్దకు రేపు వెళ్ళండి" సలహా ఇచ్చాడు వేణుగోపాలాచార్యులు.

"అలాగే! అన్నయ్యా! నన్ను తీసుకెళ్ళు ఆయనదగ్గరికి" అన్నది లక్ష్మి కంట తడిపెట్టుకొని.

"అక్కరలేదమ్మా! నేనున్నానుకదా! నేనేవెళ్ళి కనుక్కొని వస్తాను" అన్నాడు రామచంద్రరావు.

ఆరోజు సాయంత్రమే రాం జ్వాలాపతి లింగశాస్త్రిగారింటికి బయలుదేరాడు. లష్కర్‌బజార్‌లో బస్సెక్కి వరంగల్ మార్కెట్ దగ్గర దిగి, ఆకారపు నరసింగంగారి విశ్వేశ్వర దేవాలయముందాకా నడిచివచ్చి ఎదురుగావున్న శ్రీ కృష్ణా కాలనీకి వెళ్లాడు రామచంద్రరావు. అక్కడే వుంది జ్వాలాపతి లింగశాస్త్రిగారి డాబా.

"ఎవరు కావాలండీ?" శాస్త్రిగారి కూతురు కటోలు వచ్చి అడిగింది.

"శాస్త్రిగారున్నారా అమ్మాయీ?"

"ఉన్నారండీ-పూజలో వున్నారు—ఓ పది నిమిషాలలో బయటికి వస్తారు. మీపేరేమిటీ?"

"రామచంద్రరావు—కిషన్‌పురానుంచి వారితో మాట్లాడాలని వచ్చానని చెప్పమ్మా!"

"అలాగేనండీ." ఆ అమ్మాయి లోపలికి వెళ్ళింది.

కొంతసేపటికి జ్వాలాపతి లింగశాస్త్రిగారు పూజామందిరం నుండి ముందు వరండాలోకి వచ్చారు.

"త్ర్యంబకం యజామహే
సుగంధం పుష్టి వర్ధనం
ఉర్వారుక మివ బంధనా
మృత్యోర్ముక్షీయ మామృతాత్"

అని మృత్యుంజయ మంత్రం వల్లిస్తూ వచ్చారు.

రాం లేచి నిలబడ్డాడు.

"కూర్చోండి బాబూ–" అని జ్వాలాపతి లింగశాస్త్రిగారు రామచంద్రరావుకు ఎదురుగా బల్లమీద కూర్చున్నారు.

శాస్త్రిగారితో లోగడ పరిచయం లేదు రామచంద్రరావుకు.

మెడలో బంగారం పొదిగిన రుద్రాక్షల దండ, విభూతి రేఖలు, మధ్యలో కుంకుమ-పట్టుపంచ, చేతిలో తావళం.

రామచంద్రరావుతో మాట్లాడుతున్నా తావళాన్ని పంచె చెంగు చాటు చేసుకోని అలా తిప్పుతూనే వున్నారు శాస్త్రిగారు.

"నేను మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడుదామని వచ్చాను" అన్నాడు రాం.

"మీరు....రామచంద్రరావుగారు కదూ! ఆర్ట్సు కాలేజీలో చరిత్ర పాఠాలు చెపుతుంటారు."

"ఔను-నేను మీకు తెలుసా?"

"ఆఁ-ఆఁ. మిమ్మల్ని చూచాను నేను రెండు మూడు సార్లు ఈ మార్కెట్ వద్దనే. మా వాడు 'అరుగో! వారే మా హిస్టరీ సార్!' అని చూపించాడు-నాగలింగయ్యలేడూ...."

"ఆఁ-ఆఁ! సెకండియర్‌లో వున్నాడు!"

"వాడు మా వాడే!"

"అలాగా! నాగలింగం నాకు పెట్ స్టూడెండ్! కానీ ఎప్పుడూ మీ వాడని చెప్పలేదు సుమండీ!"

శాస్త్రిగారు నవ్వి, "అవసరం వచ్చి వుండదు. అయినా నేనేం కలక్టర్నా- గవర్నర్నా? మామూలు కుటుంబీకుణ్ణి. కాకుంటే అను వంశకంగా వచ్చిన మంత్రశాస్త్రం వదలలేక అలా ఉపాసన చేస్తు న్నాను. ఇది నా తరంతోనే పోతుంది. భుక్తికి మా వాడు బి. ఎ. తర్వాత మళ్ళీ ఏ క్లర్కు-గానో చేరిపోక తప్పదు" అన్నాడు.

రామచంద్రరావు ఆ మాటా ఈ మాటా మాట్లాడి మెల్లగా మాధవరావు విషయం ప్రస్తావించాడు.

"ఏమిటీ! అసలేం జరిగిందో మొదటి నుంచీ చెప్పండి" అని అడిగారు శాస్త్రిగారు.

రామచంద్రరావు, మాధవరావు ట్రాన్స్‌ఫర్ అయి వరంగల్ వచ్చిన నాటి నుండి జరిగిన చరిత్ర మొత్తం పూసగుచ్చినట్టు చెప్పాడు.

అంతే కాక ఏ పూర్ణిమ కాపూర్ణిమ నాడు జరిగిన కథ మొత్తం మాధవరావు చెపుతుంటే రాం నోట్స్ రాసుకున్నాడు కదా, ఆ కథ మొత్తం వినిపించాడు.

శాస్త్రిగారు కళ్ళు మూసుకుని వింటున్నారు. మధ్య మధ్య "ఓహోహో...." అంటున్నారు.

కామసాని, భళ్ళాళ సోమేశ్వరులు కాంచీపుర విజయయాత్ర చేసి తిరిగి వచ్చినపుడు- "ప్రధానమైన రాజమందిరాలన్నిటి ముందూ చందనాలతో కలయంపి చల్లి, కాశ్మీర కుంకుమలతో ముగ్గులు పెట్టారు. ఇందు రజముతో రంగవల్లులు తీర్చారు. కలువలూ పద్మాలూ తోరణాలుగా కట్టారు" అన్న వాక్యాలు రాం తన నోట్స్ నుండి చదివినప్పుడు శాస్త్రిగారు చిరునవ్వు నవ్వి

"చందనంబున కలయంపి చల్లినారు
మ్రుగ్గులిడినారు కాశ్మీరమున ముదమున
వ్రాసినారిందు రజమున రంగవల్లి
కంజముల దోరణంబుల గట్టినారు" అన్న పద్యం చదివారు.

"విన్నారా రామచంద్రరావు గారూ! ఇప్పుడు నేను చదివిన పద్యం శ్రీనాథుడు వ్రాసిన క్రీడాభిరామం లోనిది. ఈ పద్యంలో ఓరుగల్లులో ప్రతాప రుద్రుని కాలంలోని ఒక చిత్రశాలా ప్రాంగణం వర్ణించబడి వుంది. అంటే మీ కథలోని కామసాని చెపుతున్న ప్రత్యక్షరమూ చారిత్రకంగా సత్యమేనయ్యా!" అన్నారు శాస్త్రిగారు.

రాం మిగిలిన నోట్స్ మొత్తం వినిపించాడు.

శాస్త్రిగారు పరవశంతో విన్నారు. "ఆహాహా! ఏమి కాకతీయ

సామ్రాజ్యం! ఏమి వీరశైవవైభవం! నేను మళ్ళీ వెనుకకు పోయి ఆ సామ్రాజ్యంలో పుడితే బాగుండును" అన్నారు శాస్త్రిగారు.

"అలా ఎందుకనుకోవాలి? ఆ నాటి విశ్వేశ్వర శివాచార్యులే మీరై వుండవచ్చుగా. ఆయనే మీరుగా మళ్ళీ ఇక్కడ పుట్టారేమో!" అన్నాడు రాం నవ్వుతూ.

"అంత మాట ఎందుకులే నాయనా! ఆయన రాజగురువు. మహామంత్రవేత్త. మా వృషభధ్వజాన్ని రాజకోటపై రాజధ్వజంతో బాటు రెపరెప లాడించిన మహా తపస్వి. గోళకీమఠం ఆయన మానస పుత్రిక! ఆయనెక్కడ- నేనెక్కడ?" అని అలా కొంతసేపు పరవశంలో వుండిపోయారు శాస్త్రిగారు.

రాం, మాట్లాడకుండా ఆయన ముఖం చూస్తూ అలాగే కూర్చున్నాడు.

కొంతసేపయినాక ఊహాలోకంలో నుండి శాస్త్రిగారు వాస్తవ ప్రపంచంలోకి వచ్చారు.

"రామచంద్రరావుగారూ! మీ స్నేహితునికి కామసాని చెప్పిన ప్రతి అక్షరమూ నిజమేనయ్యా! సందేహం లేదు" అన్నారు.

"అయితే మా వాడికి మతిభ్రమణం——"

"మీ వాడికేమి మతిభ్రమణమయ్యా! ఎవరైనా నవ్విపోతారు అలా అంటే. మీ వాడు అదృష్టవంతుడు. అతడే భళ్ళాళ సోమేశ్వరు డయ్యా! కామసాని అతడి ప్రేయసి" అన్నారు శాస్త్రిగారు.

"అయితే ఈ కామసాని అనే వ్యక్తి నిజంగానే మా వాడికి గుడిలో ఈ కథంతా చెప్పిందని మీరు నమ్ముతున్నారా? లేక వాడు ఎప్పుడో చదివిన నవల అలా నరాల బలహీనత వల్ల కళ్ళకు కన్పడుతున్నదా?"

"కాదయ్యా, బాబూ కాదు. గుడిలో మీ వాడికి ప్రతి పూర్ణిమ నాడు ఆ కామసాని అనే వ్యక్తి కథ చెపుతూనే వుంది. ఇందులో అనుమానం లేదు"

"అయితే ఆ కామసాని ఎవరు? మనిషా-దయ్యమా?"

"అదిక్కడే తెలియదు. దయ్యం కావచ్చు, కాకపోవచ్చు. మన

లాంటి మనిషి మాత్రం కాదు. ఆమెకు శరీరమూ, చర్మమూ, మాంసమూ లేవు." అన్నారు శాస్త్రిగారు.

"అయితే దయ్యమేమో?"

"అలాగనీ అనలేము. ఎందుకంటే అది సహస్రమంటపాలయం. అంటే శివాలయం. శివాలయంలోకి దయ్యాలు రావడం అసంభవం. శివుడు మృత్యుంజయుడు, భూతపతి. కాబట్టి మీ వాడికి కన్పడుతున్నది మనిషీ కాదు-దయ్యమూ కాదు."

రామచంద్రరావు దీనితో మరీ భయపడ్డాడు- "మనిషీ కాక దయ్యమూ కాక మరేమిటి శాస్త్రిగారూ?"

శాస్త్రిగారు కొంచెం సేపు ఆలోచించి, "బహుశా కామసాని ఆత్మ కావచ్చు!" అన్నారు.

"అంటే—?"

"అంటే కామసాని జీవం వేయి స్తంభాల గుడిలోనే వుంది. అది పన్నెండవ శతాబ్దంలో ఆమె పార్థివ శరీరంలోనే మామూలుగా విముక్తి చెందక పోవచ్చు"

"అంటే—?"

"అంటే ఏమిటో పూర్తిగా నేనూ ఇప్పుడు చెప్పలేను. ఇది కేవలం నా ఊహ మాత్రమే."

"మరి మనకు అసలు విషయం ఎలా తెలుస్తుంది?"

"అదే సమస్య!" అని శాస్త్రిగారు కొంచెంసేపు ఆలోచించి, "రేపు త్రయోదశీ సోమవారం. మాస శివరాత్రి. నేను అఖండం వెలిగించి పూజలో కూర్చుంటాను. ఫలితంగా నాకేమైనా కొత్త ఊహలు రావచ్చు. ఎల్లుండి కన్పడండి." అన్నారు.

# 18

శాస్త్రిగారు చెప్పినట్లే మళ్ళీ రాం వచ్చాడు.

రామచంద్రరావును చూస్తూనే శాస్త్రిగారు చిరునవ్వు నవ్వారు. "మీవాడు అదృష్టవంతుడయ్యా!" అన్నారు.

రామచంద్రరావు ఆశ్చర్యంగా శాస్త్రిగారిని చూశారు.

"ఔను రామచంద్రరావుగారూ! మనకెవ్వరికీ కలుగని అపూర్వమైన అదృష్టం అతనికి కలుగుతున్నది. మీ వానితో మాట్లాడుతున్నది ఎనిమిదివందల సంవత్సరాల క్రితమున్న కామసానియొక్క జీవాత్మ!" అన్నారు శాస్త్రిగారు.

"అంటే ఏమిటో కొంచెం వివరంగా చెప్పండి శాస్త్రిగారూ!" అన్నాడు రాం కుతూహలంగా.

జ్వాలాపతి లింగశాస్త్రిగారు అప్పుడిలా చెప్పారు-

"రామచంద్రరావుగారూ!మాధవరావు మీకు కథ కొంత వరకే చెప్పాడు. కానీ ఆ తర్వాత చాలా కథ జరిగింది. అది మాధవ రావు మీకు చెప్పలేదు. ఎందుకంటే కామసాని మీ వాడితో చెప్ప లేదు కాబట్టి-''

"ఔను. మావాడు మూర్ఛపోయాడు."

"మూర్ఛపోకపోయినా మీ వాడు చెప్పలేదు. ఎందుకంటే ఆ తర్వాత జరిగిన కథ కామసానికి కూడా తెలియదు."

"అంటే....?"

''అంటే-వినండి" అని శాస్త్రిగారు ఇలా చెప్పారు-

"నిన్న నేను జపంలో కూర్చున్నాను రామచంద్రరావుగారూ! జపం ముగిశాక అఖండం వెలిగించి కొబ్బరికాయ కొట్టి పూజ చేసి కూర్చున్నాను. కొంతసేపైన తర్వాత నా మనస్సుకు ఏదో కథ స్ఫురించింది. ప్రతిభావంతులైన రచయితలకు భావస్ఫురణ జరుగుతుందే-అలాంటిది జరిగింది.ఇది అప్రయత్నంగా జరిగింది. ఒక విధంగా చెప్పాలంటే క్రాంత దర్శనం అనవచ్చు. నిన్నరాత్రి మూడో జామున స్వయంభూస్వామి స్వప్నంలోకి వచ్చాడు.

"స్వామీ! నాకు స్ఫురించిన కథ సత్యమేనా?" అని ప్రశ్నించాను.

స్వామి చిరునవ్వు నవ్వారు.

అమ్మవారు చిరునవ్వు నవ్వుతున్నది.

ఎత్తైన కొండ-అందులోనుండి సింహం.

ఆ సింహంమీద కొండ ఎక్కింది.

చూస్తుండగానే కొండ స్త్రీగా మారింది.

పదహారేళ్ళ బాలాకుమారి—

ముగ్ధ!!

ఏమి చిరునవ్వు! ఏమి అమృత వీక్షణాలు!! రామచంద్ర రావుగారూ!

మీవాడి మూలంగా రాత్రి నాకు అమ్మవారు కనిపించి ఆశీర్వదించిందయ్యా!"

అని జ్వాలాపతి లింగశాస్త్రి మళ్ళీ కొంచెంసేపు పరవశంలో ఉండిపోయాడు.

ఆ తర్వాత ఇలా చెప్పాడు-

"కామసాని ఆరోగ్యం తర్వాత క్రమంగా క్షీణించింది. భళ్ళాళ సోమేశ్వరుడు మందడ నిర్మాణాలు పూర్తిచేసుకొని సహస్ర మంటపం నిర్మాణానికై మదడనుండి ఏకశిల వచ్చాడు. సోమేశ్వరుడు వచ్చేసరికే కామసాని పరిస్థితి బాగా అధ్వాన్నమైంది.

సోమేశ్వరుడు సహస్ర మంటప మందిరంలో పనిచేస్తున్నాడే కాని అతడి మనస్సు నిలువడంలేదు.

ఒకనాడు చామకొంబ వచ్చి సోమేశ్వరుడితో చెప్పింది-

'కామసాని పరిస్థితి తీవ్రంగా వుందనీ, వైద్యులు పెదవి విరిచారనీ.'

సోమేశ్వరుడు వెళ్ళి కామసానిని చూచాడు.

ఆమె అతడిని గుర్తుపట్టలేకపోయింది.

ముప్పు యింత త్వరగా ముంచుకొస్తుందని సోమేశ్వరుడు ఊహించలేదు.

దుఃఖంతో వెళ్ళి విశ్వంభర శివాచార్యులవారిని ఆశ్రయించాడు.

శివాచార్యులవారు సోమేశ్వరుణ్ణి ఆశీర్వదించాడు.

"స్వామీ! కామసాని నా భార్య. తిరుపతిలో బాలాత్రిపుర సుందరి సాక్షిగా వివాహం జరిగింది మాకు మానసికంగా. షోడశ

సంస్కారాలలోని మా వైవాహిక సంస్కారవిధి కేవలం బాహిరం మాత్రమే. ఆమె నా వల్ల ఈ దుస్థితికి వచ్చింది. మీరెలాగైనా ఆమెను కాపాడాలి" అన్నాడు సోమేశ్వరుడు.

శివాచార్యులవారు వచ్చి కామసానిని చూచారు.

అప్పటికే ఆమె పరిస్థితి స్వాధీనం తప్పిపోయింది.

శివాచార్యులవారు ఒక్కసారి సహస్ర మంటప మందిరం వైపు చూచి అన్నారు "అంతా శివాజ్ఞ" అని.

"స్వామీః ఈమె మీ భక్తురాలు. ఈమెను చిరంజీవిగా చెయ్యండి'' అని సోమేశ్వరుడు అర్థించాడు.

''పార్థివమైన శరీరానికి ఎవరూ కర్తలు కారు. ప్రకృతి ఉపాదానం. పరమేశ్వరుడు నిమిత్తం. సృష్టి స్థితిలయాలకు పశుపతియే కర్త–

కామసాని మృత్యువును ఎవరాపగలరు సోమేశ్వరాః" అన్నారు శివాచార్యులవారు.

సోమేశ్వరుడు కంట తడిపెట్టాడు.

అతని హృదయం ఉలితో పగిలిన శిలలా అయింది.

"స్వామీః కామసాని నన్ను అమరుణ్ణిగా చేయడంకోసం తన్ను తాను సర్వసమర్పణ చేసుకున్నది. ఆమెను మీరు అమరస్త్రీగా మార్చండి. నా శిల్పంతో ఆమె ప్రాణప్రతిష్ఠ చేయండి" అని అర్థించాడు సోమేశ్వరుడు.

శివాచార్యులవారు లోగడ ఎన్నో దేవాలయాలకు ఆగమ శాస్త్రానుగుణంగా ప్రతిష్ఠలు నిర్వహించి కళాపిన్యాసాదులు జరిపారు. కాని ఒక శిల్పానికి సజీవమైన వ్యక్తి ప్రాణాన్ని ఆకర్షించి ప్రతిష్ఠాపన జరుపలేదు. ఇది చాలా సాహసవంతమైన పనిగా వారు భావించేవారు.

కాని ఇప్పుడు గత్యంతరం లేదు.

ఎటుతిరిగీ కామసాని దక్కదు.

అందుకని శివాచార్యులవారు సాహసించారు.

శివాచార్యులవారూ, సోమేశ్వరుడూ భద్రకాళికి పూర్ణిమనాడు పూజలు చేశారు.

సోమేశ్వరుడు అప్పటికే యశోధర చిత్తం సహస్ర మంట పాలయంలో చెక్కివున్నాడు.

శివాచార్యులవారు శాస్త్రసమ్మతంగా కామసానిని జీవ సమా కర్షణం చేసి ఆ శిలలో ప్రతిష్టాపన చేశారు.

కామసాని భౌతికంగా మరణించింది.

యశోధర సజీవ శిల్పసుందరిగా మారింది.

ఎలాంటి శిల్పమది?

పిలిస్తే పలికే శిల్పం!!

కాని, రామచంద్రరావుగారూ! ఆ ప్రతిష్ఠాకాలంలో సోమేశ్వ రుడు దుఃఖించాడు. మనస్ఫూర్తిగా పూజాదికాదులు నిర్వహింపలేక పోయాడు.

ఆ కక్షణ సమయంలో దీని మూలంగా పూజలోనో మంత్రం లోనో ఏదో లోపం వచ్చిందని నేను భావిస్తున్నాను.

ఫలితంగా ఆ శిల్పం ఎవరు పిలిస్తే వారికి పలకడం లేదు.

సోమేశ్వరునికి కూడా ప్రతి క్షణమూ పలకడంలేదు. కేవలం పూర్ణిమనాడు చంద్రోదయ సమయంలో పదిహేను నిమిషాలపాటు మాత్రం సోమేశ్వరునితో కామసాని మాట్లాడగలుగుతున్నది.

ఆ పదిహేను నిమిషాల కాలం జీవ ప్రతిష్ఠ జరిగిన ముహూర్తమై వుండివుంటుంది.

ఆ ముహూర్త ప్రభావం కేవలం పదిహేను నిమిషాలకే పరివ్యాప్తమైంది.

ఆ తర్వాత....

ఆ తర్వాత సోమేశ్వరుడు కళాభినివేశాన్ని ప్రదర్శింపలేక పోయాడు.

కామసానీ సంస్మరణలో పిచ్చివాడై పోయి వుంటాడు.

'దేవీ! దేవీ!' అని నిరంతరం సహస్రస్తంభ మంటపంలో తిరుగుతూ జీవితాన్ని చాలించి వుంటాడు.

ఏమైతేనేం రుయ్యమ్మ ఆదర్శ స్వప్నం ఫలించలేదు. వేయి స్తంభాల గుడి నాటికీ నేటికీ సంపూర్ణ శిల్పకళాసుందరమై ఘనీభ

వించలేదు. శిపాచార్యుల జీవాకర్షణా విధానంలో జరిగిన పొరపాటు వల్ల కామసాని ఆత్మ శిలలో నిక్షిప్తమైనా పాక్షికంగానే ప్రయోజనం నెరవేరింది.

కామసాని ఆత్మకు అటు భూతకాలమూ తెలియదు. ఇటు ప్రతాప రుద్ర చక్రవర్తి జననం, రాజ్యపాలన, మాలిక్‌కాఫరు దండయాత్ర వంటి భవిష్యత్తూ తెలియదు. ఎంతసేపూ తన జీవితకాలంలోని అంశాలను చిలుకలాగా అలా మాధవరావుతో వల్లెవేస్తూ వుంటుంది.... ఇదీ రామచంద్రరావుగారు కథ" అన్నారు జ్వాలాపతి లింగశాస్త్రిగారు.

"అయితే మాధవరావే సోమేశ్వరుడని ఆమె ఎలా గుర్తు పట్టింది?" అని ప్రశ్నించాడు రాం.

"ఇది కేవలం కాకతాళీయం మాత్రమే! సోమేశ్వరుని జన్మ తర్వాత ఆ జీవి ఎన్నో జన్మలు ఎత్తివుండవచ్చు. ఎక్కడెక్కడో జన్మించి వుండవచ్చు. ఆ వివరాలన్నీ మనకు తెలియదు.

అయితే ప్రతి పూర్ణిమనాడు కామసాని ఆత్మ సజీవమై, కాంతి శరీరం ధరించి బయటకు వస్తున్నది. ఇలా ఎనిమిదివందల సంవత్స రాలనుండీ వస్తూనే వున్నది. కాంతికి చావు లేదు. పుట్టుక లేదు. జరలేదు; మంత్రపూతమైన ప్రతిష్ఠాపన కాబట్టి కామసాని కాంతిమూర్తి నిత్యనూతనంగా నవయవ్వనంతో అలాగే వుండి పోయింది.

ఆమె ఇన్ని సంవత్సరాలనుండీ ఆ పదిహేను నిమిషాలసేపు సోమేశ్వరునికోసం ఎదురుచూస్తూ వుండవచ్చు.

ఎందరో యాత్రికులూ, తైర్థికులూ, ఇతరులూ ఈ ఎనిమిది వందల సంవత్సరాలలోనూ వేయిస్తంభాల గుడికి వచ్చి వుండవచ్చు. కాని వారిలో ఎన్నడూ సోమేశ్వరుడు పునర్జన్మమెత్తిన వ్యక్తి వచ్చి ఉండకపోవచ్చు. ఆ సన్నివేశం దాదాపు ఎనిమిదివందల సంవత్సరా లకు జరిగింది కాకతాళీయంగా.

ఇప్పుడు రాగానే— కామసాని సోమేశ్వరుణ్ణి గుర్తుపట్టింది. అంటే ఆనాటి సోమేశ్వర రూపానికీ, ఈ మాధవరావు రూపానికీ సంపూర్ణ సాన్నిహిత్యం వున్నదని ఊహించాలి" అన్నారు శాస్త్రిగారు.

"మీరు చెప్పింది నూటికి నూరుపాళ్ళు సత్యమనిపిస్తున్నది" అన్నాడు రాం.

"ఈ చెప్పింది నేను కాదు, నా ఉపాసనా దైవం" అన్నారు శాస్త్రిగారు.

"అయితే ఇప్పుడు మన కర్తవ్యమేమిటి?" అన్నాడు రాం.

"కామసాని ఆత్మ శిల్పంలో వున్నంతవరకూ మాధవరావు అటు ఆకర్షింపబడుతూనే వుంటాడు. అతడలా పరుగెత్తుతున్నంత కాలం మతిస్థిమితం వుండదు. కాబట్టి కామసానిని ఆ మంటపంలో లేకుండా చేయాలి" అన్నారు శాస్త్రిగారు.

"మీరెలాగైనా సరే మాధవరావును దక్కించాలి మాకు" అన్నాడు రాం.

"అదేమంత కష్టమైనపనికాదు. కాని కామసానిని దక్కించడ మెట్లా అన్నదే నా సమస్య. కామసానికి అటు కోరికలు చావవు. ఇటు పాంచ భౌతిక దేహం లేకపోవడంతో అవి తీరనూ తీరవు. ఇదొక రకమైన త్రిశంకు స్వర్గంలాంటిది. ఆమెకు ఇటు భూమీ అందదు, అటు కైలాస ప్రాప్తి లేదు. ఎంతకాలమీ శిలా ప్రాప్తి?? ఎన్ని యుగాలు?? ఇంకా ఎన్నివందల సంవత్సరాలు??" అన్నారు శాస్త్రిగారు.

"పోనీ....ఈజీవిని ఎవరైనా శిలలోనుంచి విముక్తంచేస్తే?" అన్నాడు రాం.

"ఔను. అదే నేనూ ఆలోచిస్తున్నాను. కాని....అది చేసే దెవరు?"అన్నారు శాస్త్రిగారు.

"ఇంకెవరు? మీరే!" అన్నాడు రాం.

"నేనా?" అని ఉలిక్కిపడ్డారు శాస్త్రిగారు.

"నాకంత మంత్రశక్తి ఎక్కడిది బాబూ?" అన్నాడు శాస్త్రి గారు.

"ఈ మాట మీ వినయాన్ని తెలియపరుస్తుందేమో కాని, మంత్రశాస్త్ర సామర్థ్యంలోని లోపాన్ని తెలియపరచదు. ఇంక నేను ఎవరితోను ఏమీ మాట్లాడను—ఏ విషయమూ ఇతరులకు చెప్పను.

ఎంత ఖర్చైనాసరే నేను భరిస్తాను. ఆ శిల్పంలోనుండి కామసాని జీవికి విముక్తి కల్పించండి" అన్నాడు రాం.

శాస్త్రిగారు చాలాసేపు దీర్ఘంగా ఆలోచించారు.

"ఏమిటలా ఆలోచిస్తున్నారు? ఆ మంత్ర ప్రక్రియా— ఆకర్షణా, ఉచ్చాటనా విధానాలు పూర్తిగాతమకు పరిచయం....??"

"ఉన్నాయి" అన్నారు శాస్త్రిగారు.

వెంటనే ఎగిరి గంతేసి రాం శాస్త్రిగారికి పాదాభివందనం చేశాడు.

"ఇంక ఆలోచించకండి. పనిచేద్దాం. ఫలితం చూద్దాం!" అన్నాడు రాం.

"సరే! అలాగే కానీ. ఈశ్వర సంకల్పమేమిటో?" అన్నారు శాస్త్రిగారు.

"అయితే ఎప్పుడు? రేపు వెళ్దామా?" అన్నాడు రాం.

"రేపా!" నవ్వారు శాస్త్రిగారు.

"నిన్న మాస శివరాత్రి! అంటే ఇంకా పదహారు రోజులకు కాని పూర్ణిమ రాదు. పూర్ణిమనాడు చంద్రోదయ సమయంలోనే మనం పూజకు కూర్చుందాము" అన్నారు శాస్త్రిగారు.

"శాస్త్రిగారూ! ఈ విషయాన్ని ఎవరికీ తెలియనీయకండి. సాధ్యమైనంత గోప్యంగా వుంచండి" అని ప్రార్థించాడు రాం.

"అది నేను మీతో అనవలసిన మాట. కావలసిన పూజా ద్రవ్యాలన్నీ చెపుతాను. శుక్ల చతుర్దశి నాటికి తీసుకొని రండి. ఈ లోగా అఖండం వెలిగించి నేను చేయవలసిన తంత్రమేదో ఇక్కడ ఇంట్లోనే ప్రారంభిస్తాను" అన్నారు జ్వాలాపతి లింగశాస్త్రిగారు.

"అలాగే" అన్నాడు రాం.

"పూర్ణిమనాడు శిథిల మంటపంలో ముగ్గువేస్తాను. అందులో మాధవరావు కూడా కూర్చోవాలి. ఎలాగైనా మీరు అతణ్ణి ఆ ఒక్క పూటా ఓ అరగంట మంచం మీది నుంచి కదల్చండి చాలు" అన్నారు శాస్త్రిగారు.

"అలాగే-అన్నట్లు ఈ లోగా మీకేమైనా కావలసి వుంటే...."

శాస్త్రిగారు నవ్వి, "ఏమీ వద్దు. అఖండానికి మాత్రం నెయ్యి మాత్రం ఇప్పించిపోండి. ఆవు నెయ్యి కావాలి. రోజూ పంచామృతాలు నాకిక్కడ దొరుకుతాయిలే" అన్నారు.

"అట్లాగే. రేపు ఉదయం ప్రయత్నిస్తాను."

"మీరేం ప్రయత్నించనక్కరలేదు. దొరికే చోటు చెపుతాను. డబ్బిచ్చి తీసుకొని రండి. అంతే."

# 19

పూర్ణిమ వచ్చింది.

రామచంద్రరావు, ఆనందరావు- ఇద్దరూ సాయంపట్టి మాధవ రావును వేయి స్తంభాల గుడికి చేర్చారు.

మాధవరావు ఆ నాడు మంచినీళ్ళు కూడా ముట్టుకోకూడదని శాస్త్రిగారు చెప్పారు.

అందుకని కాఫీ కూడా ఇవ్వలేదు మాధవ్‌కు.

శాస్త్రిగారు త్రయోదశి నుండి నిరాహారులై ఉపాసనలో వున్నారు.

పూర్ణిమనాడు వేయి స్తంభాల గుడికి ఉదయమే సుస్నాతులై వెళ్ళారు. సంధ్యా వందనాదులు అక్కడే నిర్వహించారు. మహాన్యాసపూర్వక రుద్రాభిషేకం చేసి పూజకో కూర్చున్నారు. శిధిల మంటపంలో ఒకరాతి మీద పసుపూ. కుంకుమ బియ్యపు పిండి వంటి రంగులతో ముగ్గులు పెట్టారు, ఆ పద్మాకారం చుట్టూ మూకుళ్ళు పెట్టారు. ఆ మూకుళ్ళల్లో అంతకు ముందే శాస్త్రిగారు నవధాన్యాలు వేశారు. అవి మొలకలు మొలచి వున్నాయి.

అంకురార్పణ జరిగిన ఆ మూకుళ్ళను మంత్రపూతంగా ముగ్గు చుట్టూ పెట్టారు.

దర్భలతో రావి ఆకులతో, చిన్న చిన్న రావి, జువ్వి, మర్రి, మేడి కొమ్మల ముక్కలతో ఆ ముగ్గును అలంకరించారు.

పంచామృతాలూ, పంచపల్లవాలూ, గోఘృతమూ, గోమూత్రమూ, గోక్షీరమూ, గోమయమూ నాలుగు గిన్నెలలో పెట్టి ఒక పెద్ద మూతలో ఆవు పెరుగు తెచ్చి పెట్టారు.

ఇరవై ఒక్క టెంకాయిలూ, ముప్పైయి రెండు దీపపు ప్రమిదలూ తెప్పించారు.

ప్రమిదలన్నింటినీ నేతితో నింపి పెట్టారు.

మాధవరావుకు పాంటూ షర్టు తీసి వేసి పంచె కట్టి ఒక తలపాగా చుట్టారు.

కిషన్‌పురాలో రోళ్ళు చెక్కే వారి వద్ద నుండి ఓ అయిదు రూపాయలు కిరాయి ఇచ్చి సుత్తీ. ఉలీ తీసుకొని వచ్చాడు రాం శాస్త్రి గారు చెప్పినట్లుగానే.

నిర్ణీత సమయానికి మాధవరావును శిధిల మంటపానికి చేర్చారు ఆనందరావు. రాం కలిపి. "ఏమిట్రా? నన్నేం చేస్తున్నారు?" అని అడిగాడు మాధవరావు హీనస్వరంతో,

"ఏమీ లేదు. ఇవ్వాళ పూర్ణిమ కదా! అందుకని...."

"ఈ వేషమేమిటి?" అని అడిగాడు మాధవ్.

"నిన్నామె సోమేశ్వరునిలా చూడాలనుకుంటున్నది. అందుకని...." అని చెప్పాడు రాం

మిగిలిన వివరాలేమీ చెప్పలేదు,

మాధవరావు శిధిల మంటపంలోకి వచ్చాడు.

అక్కడ జ్వాలాపతి లింగంశాస్త్రిగారు కూర్చొని మంత్రాలు చదువుతున్నారు. చిన్న యజ్ఞవేదిక కూడా వుంది.

"ఓం హ్రీం శ్రీం శ్రీ కంఠాయ శివాయనమః

ఓం హ్రీం శ్రీం శ్రీ శైలపతయే శివాయనమః

ఓం హ్రీం శ్రీం శ్రీ వల్లభాయ శివాయనమః"

బీజాక్షర సహితమైన వేద సార శివ సహస్రార్చన జరుపుతున్నారు శాస్త్రిగారు.

శాస్త్రిగారు తల పైకెత్తి మాధవరావును చూచారు.

చిరునవ్వు నవ్వి. "ఓంహ్రీం ఓంకారరూపాయ శివాయనమః"

అని నోటితో మంత్రాలు చదువుతూనే చేతితో మాధవరావును ముగ్గులో కూర్చోబెట్టమని సంజ్ఞచేశారు.

రాం, ఆనందరావులు యశోధర చిత్రాని కెదురుగా వేయబడి వున్న పద్మాకారపు ముగ్గులో మాధవ్‌ని కూర్చోబెట్టారు. "ఓం హ్రీం శ్రీం అనర్ఘ్యాయ శివాయనమః" అని చదువుతూ రాంనూ, ఆనందరావునూ దూరంగా పొమ్మని శాస్త్రిగారు సంజ్ఞచేశారు.

రాం—ఆనందరావులు నందీశ్వరుని దగ్గరికి పోయి కూర్చున్నారు.

అంటే సుమారు ఆయిదారుగజాల దూరం.

"శాస్త్రిగారు ఏంచేస్తున్నారు?" ఆనందరావు ప్రశ్నించారు.

"కామసానిని ఆవాహనచేస్తున్నారు"

"ఇంతకుముందు పన్నెండో శతాబ్దంలో చేసినట్లేనా?"

"అలాంటిదే అనుకుంటాను. కాని దానికీ దీనికీ భేదముంది. ఆనాడు శివాచార్యులవారు కామసాని జీవాన్ని ఆవాహన చేసి శిలా ప్రతిష్ఠ చేశారు. దానితో కథ మొదలైంది. ఈనాడు శిలనుండి కామసాని జీవాన్ని మళ్ళీ ఆవాహనచేసి...."

"ఆ-చేసి ..."

"చేసి, ఏం చేస్తారో తెలియదు" అన్నాడు రాం.

"అంటే అది ఆవాహన, ఇది విసర్జన" అన్నాడు ఆనంద రావు.

"సరిగ్గా అంతే!" అన్నాడు రాం.

మంటపంలో పంచామృతాలలో యజ్ఞం జరుగుతున్నది. "ఓం హ్రీం శ్రీం ఉగ్రాయశివాయనమః...."

రాం ఆనందరావును అడిగాడు "పునర్జన్మ నిజంగా వున్న దంటారా?"

"అనే మన విశ్వాసం. దానికి అనుగుణంగా కొన్ని సంఘటనలుకూడా యిటీవల జరిగాయి కదా!"

"ఏవి?"

"యు.పి.లో జరిగిన మాయాదేవి కథ"

"నేను వినలేదు''

"అదేమిటీ! అన్ని దినపత్రికలలోనూ వచ్చిందే. మధురలో మాయాదేవి అనే పిల్ల వుంది. ఆమెకు ఐదేళ్ళు రాగానే 'నేను మా అత్తగారింటికి పోతా'నని అన్నది. తల్లిదండ్రులు "చూశావా! చిన్నప్పటి నుంచి ఎంత ఊహో పిల్లకు" అని అదేదో ఆటగా భావించి మురిసిపోయారు. కాని క్రమంగా ఆ పిల్ల తిండీ నిద్రా మానేసి తనను అత్తగారింటికి పంపమని మారాం చేసింది...." అని శిధిల మంటపంవైపు చూశాడు ఆనందరావు.

శాస్త్రిగారు అంగన్యాసకరన్యాసాదులు చేసి అష్టదిగ్బంధం చేశారు సోమేశ్వరుడికి అంటే మాధవరావుకు-

"ఏవం హృదయాధి న్యాసః
అస్త్రాయఫట్
ఓం భూర్భువస్సువరో మితి దిగ్బంధం"

నందీశ్వరువివద్దకు ఈ మంత్రాలు వినబడుతున్నాయి.

వాచ్ మన్ వచ్చి "ఆ పంతులుగారు ఏం చేస్తున్నారు సార్?" అని ప్రశ్నించాడు.

"ఇవ్వాళ పూర్ణిమకదూ! ఏదో పూజ చేసుకుంటున్నాడు" అని చెప్పాడు రాం.

వాచ్ మన్ అంతటితో సంతృప్తి చెందలేదు.

రాం చిరునవ్వు నవ్వి బక్షీ యిచ్చాడు.

దానితో వాచ్ మన్ వెళ్ళాడు.

"ఓం సద్యోజాతం ప్రపద్యామి
సద్యోజాతాయవై నమోనమః'' మంత్రాలు వినపడుతున్నాయి.

"ఆఁ....తర్వాత ఏమయింది?" రాం ప్రశ్నించాడు.

"ఏముందీ? ఆ పిల్లకేదో గాలిచేష్ట తగిలిందని వైద్యం చేయించారు. లాభం లేకపోయింది.

"అయితే, పోవే మీ అత్తగారింటికి" అన్నారు తల్లిదండ్రులు.

"నేనొక్కతెనే ఎలా పోతానూ? ఓగబెట్టండి" అంది మాయాదేవి. ఆ పిల్ల పేరు మాయాదేవి.

"మీ అత్తగారిల్లు ఎక్కడ వున్నది?" అని అడిగారు. వేరే వూర్లో ఏవేవో గుర్తులు చెప్పి "ఆ ఇల్లు" అన్నది.

తల్లిదండ్రులు ముందు మనుషులను పంపించి విచారించారు. మాయాదేవి చెప్పిన గుర్తులు గల ఇల్లు సరిగ్గా అక్కడ వుంది" ఆగాడు ఆనందరావు.

"నిజమా?" అని రాం నివ్వెరపోయాడు.

"ఇతి కవచ పూర్వక శరీరే శివన్యాసః" మంత్రాలు విన్పడుతున్నాయి.

"ఆఁ-తర్వాత:"

"తర్వాత కొందరు డాక్టర్లతో ఒక బృందం వచ్చి మాయాదేవిని పరీక్షించారు. వారికేమీ అంతుపట్టలేదు. సరేనని మాయాదేవిని బండిమీద ఎక్కించి వీరంతా వెంట బెట్టుకొని అత్తగారిల్లు వున్న వీధికి తీసుకెళ్ళారు....

"నమోహిరణ్య బాహవే హిరణ్య వర్ణాయ...."

శాస్త్రిగారి మంత్రాలు—

"బండిని. అటు-ఆ పచ్చ మిద్దె దగ్గరకు తీసుకుపొమ్మని చెప్పింది మాయాదేవి స్వయంగా. ఆ ఇంట్లో ఒక ముసలాయనా ముసలావిడా, వారి కొడుకూ వున్నారు. ఆ కొడుకుకు నలభై ఏళ్ళకు పైగా వుంటాయి. ప్రయోగాత్మకంగా పక్కింటివాళ్ళనూ ఈ పచ్చ మిద్దెలోని వాళ్ళను కలపి గుంపుగా నిలపెట్టారు డాక్టర్లు.

మాయాదేవి లోపలికి వచ్చింది.

సరిగ్గా పచ్చమిద్దెలోని దంపతులనే ఆ గుంపులోనుండి గుర్తుపట్టివారికే పాదాభివందనం చేసింది. 'వీరే మా అత్త మామలు' అన్నది-"

"ఏమాశ్చర్యం!" అన్నాడు రాం''

"హరి కేశాయ విభవే

"పంచవక్త్రాయ వజ్రిణే"—శాస్త్రిగారి మంత్రాలు....

"తర్వాత....?" రాం ఉత్సుకతో ప్రశ్నించాడు.

"తర్వాత ఆ ముసలివాళ్ళ కొడుకున్నాడే నలభై ఏళ్ళ ఆయన-ఆయనకు వెళ్ళి మాయాదేవి పాదాభివందనం చేసింది. 'ఈయనే నా భర్త' అన్నది.

అంతా నివ్వెరపోయారు.

అతడు నలభై ఏళ్ళవాడు.

ఈ పిల్ల ఐదేళ్ళది.

ఐతే విచిత్రమేమిటంటే రామచంద్రరావుగారూ! సుమారు ఐదేళ్ళకు ముందు అతడి భార్య చనిపోయింది-''

రాం దిగ్భ్రాంతిచెంది వింటున్నాడు.

"అయోన యేసుదేహాయహ్యాత్తమాయ నమోనమః"— శిధిల మంటపంతో మంత్రాలు

"అంటే ఇక్కడ చనిపోయిన పిల్ల మధురలో మాయాదేవిగా పుట్టిందన్నమాట వెంటనే."

"అయితే ఆ పిల్లను ఆ ముసలి మొగుడిదగ్గర వదిలేసి వెళ్ళారా తల్లిదండ్రులు?" ప్రశ్నించాడు రాం.

"ఏ తల్లిదండ్రులైనా ఎలా చేయగలుగుతారండీ అంత పని... అయితే సైకియాట్రిష్టులకు ఈ వింత ఏమిటో అంతుబట్టలేదు. కాకుంటే తేలిన సారాంశమేమంటే మాయాదేవికి మనందరిలాగా పునర్జన్మ స్మృతి నశించలేదనీ-ఏదోకారణంగా అది ఇంకా కంటిన్యూ అవుతూనే వుందని"

"మనం ఎంత అదృష్టవంతులం. గతజన్మ స్మృతులు కూడా వుంటే ఎందరు తండ్రులో, ఎందరు భార్యలో, ఎందరు అక్కా-చెల్లెళ్ళో-ఎన్ని సంసారాలో- అమ్మ నాయనో!" రాం నవ్వాడు.

"నమః ఖట్వాంగహస్తాయ
నాగహస్తాయతే నమః-" శాస్త్రిగారు.

''రామచంద్రరావుగారూ!'' అని కేకవేశారు. శాస్త్రిగారు.

"ఆఁ!"

"రండి మీరిద్దరూ!''

రాం, ఆనందరావులు ఆదరాబాదరా లేచారు-

"తర్వాత ఏమయింది?" రాం ప్రశ్నించాడు.

"అలా ఆ పిల్లకు పదమూడేళ్ళు వచ్చేవరకూ పూర్వజన్మ స్మృతులున్నాయట....తర్వాత క్రమంగా ఫేడ్ అయిపోయాయి. ఆ తర్వాత మాయాదేవికి వేరే పెండ్లి జరిగింది. ఆ సంసారంలో ఆమె మామూలుగానే ఇమిడిపోయింది."

శిధిల మంటపందగ్గరికి వచ్చారు ఇద్దరూ అప్పటికి.

ఆకాశంలో చంద్రోదయమైంది.

"నాయనా! భళ్ళాల సోమేశ్వరా! నేను మంత్రాలు చదువుతూ వుంటాను. నీవు ఉలితో ఈ శిల్పాన్ని చెక్కుతున్నట్లు నటించు."

మాధవరావు ఉలిని, సుత్తినీ పట్టుకొని శిల్పాన్ని చెక్కుతున్నట్లు కూర్చున్నాడు మోకాళ్ళమీద. శాస్త్రిగారు ఆవాహన మంత్రాలు చదువుతున్నారు.

ఏదో సామవేదం పాడినట్లుగా వుంది రాంకు.

'అదర్వణవేదంనుండి ఈ మంత్రాలు తీసుకున్నారా'? అని పించింది వేదాలతో కొంచెం పరిచయమున్న ఆనందరావుకు.

చంద్రుడు శిధిల మంటపంలో అమృతం కురిపిస్తున్నాడు.

ఉన్నట్లుండి శిధిల మంటపం వెలిగినట్లనిపించింది.

"కామసానీ- కామసానీ! దేవీ!" మాధవరావు అరిచాడు.

రామచంద్రరావుకూ, ఆనందరావుకూ ఏమీ కన్పడలేదు కాని కామసాని మాధవ్ ముందు ప్రత్యక్షమైందని మాత్రం గ్రహించారు.

"సోమేశ్వరా! నీవు కారణజన్ముడివి. ఈ సహస్ర మంటప నిర్మాణం చేయమని గణపతిదేవులవారి ఆజ్ఞ! ఈ శిల్పాన్ని సరిగా మూర్తిమంతం చేయాలి. నీ ఉలిని ఈ శిల్పం నుదుట స్పృశించు."

సోమేశ్వరుడు ఉలిని శిల్పం నుదుటపెట్టాడు.

శాస్త్రిగారు పెద్దగా మంత్రాలు చదువుతూ, మిగిలివున్న నెయ్యి మొత్తం హోమంలో పోశారు.

హోమం ఒక్కసారి భగ్గున మండింది.

శంఖం ఊది, గణ గణ గంట వాయించి-

"సోమేశ్వరా! అక్కడ సుతారంగా ఒక దెబ్బ కొట్టు" అన్నారు.

సోమేశ్వరుడు శిల్పసుందరి ఫాల భాగంలో చిన్న దెబ్బ కొట్టాడు.

"ఋచేత్వా రుచేత్వాసమిత్స్రివన్తి సరితోనధేనాః" అంతర్హృదా మనసాపూయ మానః, మృత స్వధారా అభిచాకశీమి, హిర ణ్యయో వేత సోమధ్య ఆసాం, తస్మింత్సుపర్ణో మధుకృత్కులయీ, భజ న్నాస్తి మధు దేవతాభ్యః-"

"సోమూ!" అని పెద్దగా కామసాని అరిచింది.

ఈ అరుపు ఆనందరావుకూ మాధవరావుకూ కూడా విని పించింది.

మరుక్షణమే శిథిల మంటపంలోని కాంతి ఒక్కసారి ఆరి పోయినట్లనిపించింది.

అక్కడ కూర్చున్న నలుగురి కళ్ళూ చీకట్లు కమ్మినట్లయింది.

"శాస్త్రిగారూ!" రాం భయంతో అరిచాడు.

"భయపడకండి! కామసాని కష్టం తీరిపోయింది. ఆమె

జీవాత్మ ఈ శిలనుండి విముక్తమై తిరిగి పాంచభౌతిక ప్రపంచ ప్రవేశం పొందింది. ఈ శిల్పం రేపటినుంచి ఇప్పుడున్నంత అందంగా ఇక వుండదు.....

ఓం ఓం ఓం....పృధివీశాన్తాసాగ్ని నాశాన్తా సామేశాన్తా శుచగ్ంశమయతు- అంతరిక్షగ్ం శాన్తంతద్వాయు నాశాన్తంతనే సామేశాన్తా శాన్తగ్ం శుచగ్ంశమయతు-ద్యౌశ్శాన్తా సాధిత్యేశాన్తా శుచగ్ం శమయతు...."

భళ్ళున సోమేశ్వరుడు 'దేవీ!' అని వెర్రికేక పెట్టి ముగ్గులో పడిపోయాడు.

# 20

సూర్యోదయమైంది.

మాధవరావు మంచంమీదినుండి లేచి కూర్చున్నాడు.

కాత్యాయనీ, లక్ష్మి, రాం, ఆనందరావు, శాస్త్రిగారు అంతా కనిపెట్టుకొని కూర్చున్నారు ఈ ముహూర్తం కోసం.

మాధవరావు లేస్తూనే తన చుట్టూ వున్న వారందరినీ చూచి బలహీనంగా నవ్వి, "ఏమిటిలా వచ్చారు అందరూ ఒకేసారి" అని మర్యాద చేయబోయాడు.

జ్వాలాపతి లింగశాస్త్రిగారు తృప్తిగా నవ్వి," బాబూ! ఇక వెళ్ళివస్తాను, రిక్షాను పిలిపించండి" అన్నారు రాంతో.

మాధవరావు మంచంమీదినుండే అన్నాడు "ఆకలి-విపరీతమైన ఆకలిగా వుంది లక్ష్మీ!! ఏం చేస్తూన్నావు నువ్వు?"

"వస్తున్నానండీ-కాఫీ తెచ్చి ఇస్తాను-మొఖం కడుక్కోండి" ఆమె కళ్ళవెంట ఆనందాశ్రువులు రాలుతున్నాయి. భర్తకు ఆకలి కలగడమూ తనను గుర్తుపట్టి పేరుతో పిలవడమూ ఇదే మొదలు మళ్ళీ!!

రిక్షా వచ్చింది. శాస్త్రిగారు ఎక్కారు.

రాం, ఆనందరావులు వాకిటిదాకా వచ్చి రిక్షావాడికి ముందే రూపాయిపావలా ఇచ్చారు.

"శాస్త్రిగారూ! మేము మళ్ళీ కలుస్తాం-"

వారు నవ్వి, "మళ్ళీ కలియనక్కరలేదు. మీ మాధవరావు ఇప్పుడు ఆరునెలల ఆకలిమీద వున్నాడు. కాఫీ లాభంలేదు-హోటలు నుండి ఓ ఇరవయ్యో ముప్ఫయ్యో ఇడ్లీలు తెప్పించి పెట్టండి" అని చెప్పి వెళ్ళిపోయారు.

కొంతసేపయిన తర్వాత ఆనందరావూ, రాం, వేయిస్తంభాల గుడికి బయలుదేరారు.

"ఎక్కడికి వెళుతున్నారు?" మాధవ్ ప్రశ్నించాడు.

"వేయి స్తంభాల గుడికి-వస్తావా?" రాం అడిగాడు.

"ఇంత ప్రొద్దున్నే ఆ గుడిలో ఏముందీ చూడడానికి? చూచిన గుడేకదా! నేను రాలేను." అన్నాడు. మాధవ్.

* * *

బ్యాంకిలో డబ్బుపోలేదనీ, కేవలం లెక్కలలోనే తేడా వచ్చిందనీ విచారణలో తెలిసింది. అజాగ్రత్తకు ఒక ఇంక్రిమెంటు ఆపి మాధవరావుకు తిరిగి ఉద్యోగం ఇచ్చారు అధికారులు. ఇస్తూ విజయవాడకు ట్రాన్స్ఫర్ చేశారు. ఓ ఏడాది తర్వాత విజయవాడ నుండి రామచంద్రరావుకు ఉత్తరం వచ్చింది. "ప్రియమైన రాం! ఇక్కడ అంతా క్షేమం, నా ఆరోగ్యం బాగుంది. నీ నుండి ఇటీవల జాబులు లేవు. విజయవాడ వచ్చి ఏడాది అయినా మిమ్మల్నీ, మీ అనురాగాన్నీ మరచిపోలేపోతున్నాను. వరంగల్ లో ఉన్నప్పుడుమా మీద మీరంతా చూపిన ఆదరణ ఏ బంధువులవల్ల కూడా లోకంలో ఎవరికీ లభించదు. అన్నట్లు నీకో వార్తచెప్పనా? చి॥ సౌ॥ లక్ష్మి ప్రసవించి ఆడపిల్లను కన్నది. వరంగల్ జ్ఞాపకాలకు చిహ్నంగా ఆమెకు శ్రీదేవి అని పేరు పెట్టాము. ఉంటాను మాధవ్."

—శుభమ్—


విజయ

అక్టోబర్ నెల నవలానుబంధ మాలిక

"ఈ ప్రశ్నకు బదులేది?"

డా॥ సి. ఆనందారామం రచన.

VIJAYA SEPTEMBER 1977 Regd. No. M.

# విజయ

అనుబంధమాలికలో వెల
ఇరవైయ్యవ నవల





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M133 |
| పుస్తకం పేరు | విజయ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 0, BC |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Soumya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Chikanya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |